"స్పైడర్‌మాన్
తర్వాత ఇంకో రస్న తాగుదాం, సరేనా!"

చల్ల నారింజ రుచి! బలే మజా!

# రస్న

భారతదేశపు అత్యధికంగా అమ్ముడవుతున్న
సాఫ్ట్ డ్రింక్ కాన్సంట్రేట్






Mudra:A:PI



మిఠాయిల మహారాజ
వెన్న రుచిని ఎప్పటికన్నా మిన్నగా చేశాడు







# ట్రై-మీ



ట్రై-మీ వెన్న అందించే కమ్మని నోరూరించే రుచితో సరికొత్త, మెత్తని మిఠాయి....మీకు ఎంతో ఇష్టమైనవారిని మెప్పించాలనుకున్నప్పుడు సరిగ్గా సరిపోయే మిఠాయి

<u>నోరూరించే రకరకాల ప్యారీస్ మిఠాయిలు:</u>

కారమిల్క్ • ట్రై-మీ
చాకొలెట్ ఎక్లైర్స్
కోకోనట్ పంచ్
చాక్లైర్స్ • కోకోనట్ క్రీమ్
లాలీపాప్స్ • గోల్డెన్ బాన్ బాన్




70 సంవత్సరాలకుపైగా
మిఠాయిలలో
మొట్టమొదటి పేరు

PCL 1829



# చందమామ

మే 1986



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 2-50

సంవత్సర చందా: 30-00

“



ప్రెషర్ కుక్కర్ల డీలర్‌నైన నేను, ఏది భద్రతగల కుక్కరో, ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను. అయితే వాటి అన్నింటిలోను అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్. కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా.

న్యూ ప్రెస్టీజ్
ఎంత భద్రమైనదో చూడండి

నూటికి నూరుపాళ్ళు భద్రతను చేకూర్చే

100%
SAFE

అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి.ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్' పూడుకొనిపోయినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది.




ఇది కుక్కర్‌కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణమించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ అయితే, మితిమీరి ఏర్పడిన నీటి ఆవిరి జి.ఆర్.ఎస్‌ను బయటకు నెట్టుతుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది. గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో లోపలికి నెట్టండి.



అంతే. ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ అయితే ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది. సర్వదా. ”

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు




## ప్రెస్టీజ్




TTK తయారీ

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3G TEL 85




సూపర్ ఫ్రెష్ సహజమైన హాయనిపించే సుఖానుభూతిని
చేకూర్చే సుగంధ భరిత క్రొంగొత్త సబ్బు, మీచర్మానికి
మృదుత్వాన్ని చేకూర్చి మీకు ఉల్లాసాన్ని కొనితెస్తుంది.
అందుకే కొద్దిగా తాజాదనాన్ని జల్లుకోండి,
ఈ రోజును సూపర్ ఫ్రెష్ రోజుగా తీర్చుకోండి.

48 TL

# నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి.



# మీ కుటుంబంలోని వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని ఇవ్వండి!

క్రమం తప్పకుండా కోల్గేట్ ని వాడటంతో మీ కుటుంబంలోని
వారి నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా ఉంటుంది, వారి పళ్లు యిక దృఢంగా,
ఆరోగ్యంగా ఉంటాయి. కోల్గేట్ రక్షణ చక్రం చేసేది అదే,
వారికది యివ్వడం అందుకే.

మీరు పళ్ళు తోముకున్న ప్రతిసారీ, కోల్గేట్ యొక్క నమ్మకమైన ఫార్ములా చేసేదిది-చూడండిలాగ.



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్ లోని అద్వితీయమైన శక్తిగల నురగ లోపలికి చొచ్చుకుపోయి, అక్కడ గల దుర్వాసన కలిగించే ఆహారపు తునకల్నీ, దంతక్షయాన్ని కలిగించే సూక్ష్మజీవుల్నీ తొలగిస్తుంది.



క్రమం తప్పకుండా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటే, దాంతో యిక మీకు శుభ్రమైన, తాజా శ్వాస, దాంతోపాటే దృఢమైన, ఆరోగ్యమైన పళ్ళూను.

భోజనం చేసిన తర్వాత ప్రతిసారీ మీ కుటుంబంలో వారంతా కోల్గేట్ తో పళ్ళు తోముకుంటున్నారని ధృవపరుచుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి. దంతక్షయాన్ని ఎదుర్కోండి. వారికి కోల్గేట్ రక్షణ చక్రాన్ని యివ్వండి.




84-55 Tel

*దీని తాజా*
*పిప్పరమెంట్ రుచి మీకెంతో నచ్చుతుంది!*

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["లోపం ఎవరిది?"]కి ఆధారం, జొన్నలగడ్డ రత్న రచన. అధికారంలో వున్నవాడిలో దయా ధర్మగుణాలు లోపించినప్పుడు, సామాన్యుడి జీవితం నరకప్రాయమవుతుంది. అయితే, అలాంటి సామాన్యవ్యక్తి అధికారదర్పానికి తలవంచక, ధైర్యంగా దాన్ని ఎదిరించినప్పుడు సత్ఫలితాలు కలిగే అవకాశం వున్నది. ఈ సంగతి ''ఉన్నత న్యాయ స్థానం'' అన్న కథలో స్పష్టపరచబడింది.

## అమరవాణి

సద్విద్యా శక్యతే లబ్ధుం, గురూణా ముపదేశతః,
శీలం స్వాభావికం తత్తు, లభ్యతే నోపదేశతః.

[గురువు బోధించగా ఉత్తమ విద్యను పొందవచ్చును. కాని, ఉత్తమ స్వభావం మాత్రం, కేవలం బోధలవల్ల లభ్యపడదు.]

సంపుటి 78 మే '86 సంచిక 5

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00






స్కూలు
పుస్తకాంపై
అతికించండి
పార్లే.
టిఫిన్
డబ్బాలలో
నింపండి
పార్లే.

PARLE
Melody Chocolate Toffs



PARLE
POPPINS




PARLE Gluco




NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE Gluco



NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE Melody Chocolate Toffs



NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE POPPINS




NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE POPPINS




NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE Melody Chocolate Toffs



NAME ____________
CLASS ________ DIV. ________
SUBJECT ____________
SCHOOL ____________

PARLE Gluco



## చందమామ కబుర్లు



### పొగతెచ్చే ప్రమాదం!

పొగపీల్చడం వల్ల ప్రపంచం మొత్తం మీద రోజూ దాదాపు 28,000 మంది అకాలమరణానికి గురవుతున్నారు. మరెందరో రకరకాల వ్యాధులకు లోనవుతున్నారు. కలకత్తాలో ఇటీవల జరిగిన నాలగవ కుటుంబ సంక్షేమ సభలో ఈ విషయం వెల్లడయింది.

### మృత్యుముఖం నుంచి బయటపడిన వనిత!



చైనాలో యాంగ్ లొక్వాన్ అనే 22 యేళ్ళ వనిత సైకిల్ మీద వెళుతూ, దగ్గరిదారికదా అనుకుని నీళ్ళు గడ్డకట్టుకుపోయిన నది మీద ప్రయాణం చేస్తూ ఉండగా, మంచు కొస్త కరగడంతో నీళ్ళల్లో మునిగి పోయింది. దాపులనున్న కొందరు ఆమెను బయటకు తీసి ఆస్పత్రిలో చేర్చేసరికి ఆమె గుండె పూర్తిగా ఆగిపోయింది. అయినా, ఎనభై నిమిషాల తరవాత ఆమె గుండె తిరిగి కొట్టుకోవడం ప్రారంభించింది।



### నేత్ర సంరక్షణ

ఇటీవల ఢిల్లీలో పిల్లల నేత్ర ఆరోగ్యరక్షణ గురించి ఒక సదస్సు ఏర్పాటు చేయబడింది. మన దేశంలో రకరకాల కారణాలవల్ల యేటా దాదాపు 4,000 మంది పిల్లలు కంటి చూపును కోల్పోతున్నారన్న విషయం ఆ సదస్సులో వెల్లడయింది. తొంభై లక్షలమంది అంధులు అంటే ప్రపంచంలో మూడోవంతు మంది మన దేశంలో నివసిస్తున్నారు।

## మీకు తెలుసా?

1. నెపోలియన్ పుట్టుకతో సంబంధం ఉన్న ద్వీపం ఏదో మీకు తెలుసా?
2. అమెరికా స్వాతంత్ర్య సంగ్రామ నాయకుడు ఎవరో మీకు తెలుసా?
3. ఢిల్లీ సింహాసనాన్ని అధిష్ఠించిన మొట్ట మొదటి ముస్లిం వనిత ఎవరు?
4. పదిహేను సంవత్సరాలు దేశాన్ని వదలి పొరుగు రాజ్యంలో గడిపిన మొగలు చక్రవర్తి ఎవరో మీకు తెలుసా?
5. 'నైటింగేల్ ఆఫ్ ఇండియా' అని ప్రసిద్ధి గాంచిన వారెవరు?

(సమాధానాలు 65వ పేజీలో)

పురాణగాథలు :

# దుర్మదుడు

దేవేంద్రుడి కొలువులోని అప్సరసలలో ఊర్వశి ముఖ్యురాలు. ఆమె అందచందాలను చూసి, దుర్మదుడనే గంధర్వుడు ఆమెను వివాహమాడ దలిచాడు. కాని ఊర్వశి అందుకు సమ్మతించలేదు.

ఊర్వశి చంద్రవంశపు రాజైన పురూరవచక్రవర్తిని వరించి, వివాహమాడడానికి నిశ్చయించింది. ఒకనాటి పున్నమిరేయి, ఊర్వశి పురూరవుని కలుసుకోవాలని, నందనవనంలో ఒక పొన్నచెట్టు కింద చంద్రశిలాఫలకం మీద కూర్చుని, ప్రియుని కోసం ఎదురు చూడసాగింది.

ఈ విషయం పసిగట్టిన దుర్మదుడు, ఇదే మంచి సమయం అనుకుని, పురూరవచక్రవర్తి రూపం ధరించి, ఊర్వశిని సమీపించాడు. ఆమె అతణ్ణి చిరునవ్వుతో పలకరించగానే, అతడు ఆమె మెడలో పూలమాల వేశాడు. ఇరువురూ సంతోషంగా మాట్లాడుకో సాగారు.

కొంతసేపటికి, అసలు పురూరవుడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూసి, పురూరవుడి రూపంలో ఉన్న దుర్మదుడు ఎగతాళిగా నవ్వాడు. దానిని చూసి, దుర్మదుడి మోసాన్ని గ్రహించిన ఊర్వశి కోపంతో అతణ్ణి, "నువు రాక్షసుడివై పోదువుగాక!" అని శపించింది.

చేసిన అపరాధం క్షమించి, శాపాన్ని ఉపసంహరించుకోమని దుర్మదుడు, ఊర్వశిని వేడుకున్నాడు. ఆ తరవాత ఊర్వశి, "భూలోకంలో మానవుడివై పుట్టి యుద్ధంలో దుర్మరణం పాలవుదువుగాక!" అని దుర్మదుణ్ణి శపించింది.





# పుణ్యఫలం

కౌముదీ రాజ్యంలోని శాంతివనంలో, జీవానందుడు అనే ఋషి వుండేవాడు. ఆయన శిష్యుడు ప్రబోధుడు, గురువు శిక్షణలో వేదవేదాంగాలు క్షుణ్ణంగా అభ్యసించాడు. జీవానందుడు తరచూ ప్రబోధుడికి, కాశీవిశ్వేశ్వరుణ్ణి దర్శించడం వల్ల కలిగే పుణ్యఫలం గురించి చెప్పేవాడు. దానితో ప్రబోధుడికి, ఆ దేవుణ్ణి దర్శించాలన్న బలమైన కోరిక కలిగింది. ఇది తెలుసుకున్న జీవానందుడు, అలాగే కాశీ వెళ్ళి రమ్మని, శిష్యుణ్ణి దీవించాడు.

ప్రబోధుడు బయలుదేరి కొన్ని రోజులు ప్రయాణం చేశాక, కాలి చెప్పొకటి తెగింధి. అతడికి కొద్ది దూరంలో ఒక పెద్ద మర్రిచెట్టు కింద కూర్చుని చెప్పులు కుడుతున్న వాడొకడు కనిపించాడు. ప్రబోధుడు వాణ్ణి సమీపించి, తెగిన చెప్పు అందించాడు.

ఆ చెప్పులు కుట్టేవాడి పేరు కాళిదాసు. వాడు ప్రబోధుడి చెప్పు కుడుతూ, "అయ్యా, తమ ప్రయాణం ఎక్కడి వరకు?" అని అడిగాడు.

"మాది కౌముదీ రాజ్యం. కాశీవిశ్వేశ్వరుణ్ణి దర్శించడానికి వెళుతున్నాను," అన్నాడు ప్రబోధుడు.

ఆ మాటలు వింటూనే కాళిదాసు కళ్లు కాంతితో మెరిసినై. "కాశీవిశ్వేశ్వరుణ్ణి దర్శించడమంటే మాటలా! తమరు నిజంగా అదృష్టవంతులు," అన్నాడు వాడు.

కుట్టిన చెప్పు తొడుక్కుని ప్రబోధుడు, వాడికి ఒక వెండి కాసు యివ్వబోయాడు. కాళిదాసు వెండికాసు పుచ్చుకోకుండా, "అయ్యా, నా పేరు కాళిదాసు. తమరు విశ్వేశ్వరుణ్ణి దర్శించాక, నా పేరు చెప్పి, ఆ వెండికాసును హుండీలో వెయ్యండి," అని కోరాడు.

ఎస్. శివనాగేశ్వరరావు



''శాలువా అంచుకు వున్న ముడిలో ఏమున్నది, బంగారమా?'' అని గర్జించాడు అగ్నిశిఖుడు.

ప్రబోధుడు శాలువా అంచుముడి విప్పి, వెండినాణెం తీసి అగ్నిశిఖుడికి చూపుతూ, ''దయవుంచి, ఇది మాత్రం అడగకు. కాశీవిశ్వేశ్వరుడి హుండీలో వేయమని, ఒక చెప్పులు కుట్టేవాడు దీన్ని ఇచ్చాడు,'' అని చెప్పాడు.

ఆ జవాబు విని, అగ్నిశిఖుడు ఆలోచనలో పడ్డాడు: చెప్పులు కుట్టుకునే నిర్భాగ్యుడే దేవుడికి వెండినాణెం కానుకగా యిచ్చాడు. తనముందు వాడేపాటి!

అగ్నిశిఖుడు తాను తీసుకున్న వంద వరహాలూ, ప్రబోధుడికిచ్చి, ''నా పేరు అగ్నిశిఖుడు. నా పేరు చెప్పి, ఈ డబ్బును విశ్వేశ్వరుడి హుండీలో వెయ్యి,'' అని, తన దారిన వెళ్ళిపోయాడు.

ప్రబోధుడు నెల ప్రయాణం తరవాత, ఒక కీకారణ్యం గుండా వెళ్లవలసివచ్చింది. ఆఅరణ్యంలో రుధిరవర్ణుడనే బ్రహ్మరాక్షసుడున్నాడు. వాడు, ప్రబోధుణ్ణి చూస్తూనే పెద్దగా కేకపెట్టి, అతణ్ణి పట్టుకున్నాడు.

ప్రబోధుడు భయంతో కంపించిపోతూ, ''రాక్షసోత్తమా, ఒక్క మాట! నేను కాశీ విశ్వేశ్వరుణ్ణి దర్శించడానికి బయలుదేరాను. అదొక్కటే అయితే, నీకు

ప్రబోధుడు అందుకు సరే అని, మరిచిపోకుండా వుండేందుకు వెండికాసును శాలువా అంచుకు మూటగట్టి, తిరిగి ప్రయాణమయ్యాడు.

అతడు ఒక అడవిగుండా పోతూండగా, అగ్నిశిఖుడనే దొంగ గుర్రం మీద ఎదురయ్యాడు. వాడు ప్రబోధుణ్ణి చూస్తూనే, ''నీ దగ్గిర వున్న డబ్బంతా అక్కడ పెట్టు!'' అని హుంకరించాడు.

ప్రబోధుడు దారి ఖర్చులకుగాను తెచ్చుకున్న వందవరహాలూ దొంగకిచ్చాడు. ఆ సమయంలో అగ్నిశిఖుడి దృష్టి, ప్రబోధుడు శాలువా అంచుకు ముడివేసిన వెండినాణెం మీద పడింది.

నిరభ్యంతరంగా ఆహారం అయేవాడిని. కాని, మార్గమధ్యంలో చెప్పులు కుట్టే వాడొకడు, స్వామికి సమర్పించమని, ఒక వెండికాసు యిచ్చాడు. ఒక దొంగ, నా దగ్గిర దోచుకున్న డబ్బే నాకిచ్చి, స్వామికి కానుకగా యివ్వమన్నాడు. ఇప్పుడు నేను, నీ కాహారమైతే, ఆ పుణ్యకార్యాలు చేయ నందువల్ల, నాకు పాపం చుట్టుకుంటుంది. దయవుంచి నన్ను ప్రాణాలతో వదులు. తిరుగుప్రయాణంలో తప్పక, నీకాహార మవుతాను,'' అన్నాడు.



రుధిరవర్ణుడికి, ప్రబోధుడు సత్యమే చెబుతున్నాడన్న నమ్మకం కలిగి, అతణ్ణి వదిలివేశాడు.

మరి కొంత కాలం ప్రయాణం చేసి, ప్రబోధుడు కాశీనగరం చేరాడు. అక్కడ అతడు విశ్వేశ్వరుడి దర్శనం చేసుకుని, హుండీలో కాళిదాసు యిచ్చిన వెండి నాణెంతోపాటు, దొంగ అగ్నిశిఖుడు తిరిగి యిచ్చిన వరహాలు కొన్ని కానుకగావేశాడు.

తరవాత అతడు తిరుగుప్రయాణమై, రుధిరవర్ణుడికి ఆహారం కావడానికి కీకారణ్యం చేరాడు. అక్కడ అతడికి ఒక కోయవాడు కనిపించాడు. బ్రహ్మ రాక్షసుడు తిరుగాడే అరణ్యంలో, ఒక కోయవాడు నిర్భయంగాసంచరిస్తూండడం ప్రబోధుడికి ఆశ్చర్యం కలిగించింది.

అయితే, కోయవాడు ప్రబోధుడికి నమ స్కరించి, ''మహానుభావా, నేనే బ్రహ్మ రాక్షసుడినైన రుధిరవర్ణుణ్ణి! మిమ్మలను చంపి తినకుండా, విశ్వనాథుడి సందర్శ నార్థం విడిచి పుచ్చినందుకు, నాకు లభ్య మైన పుణ్యఫలమే, అన్ని జన్మలలో ఉత్తమమైన, ఈ మానవజన్మ!'' అన్నాడు.

ప్రబోధుడు, రుధిరవర్ణుడిని ఆశీర్వ దించి ముందుకు సాగాడు. ఒకచోట అతడికి కొందరు ఆటవికులు కనిపించారు. డప్పుల మోతను బట్టి, వాళ్ళందరూ గుంపుగాచేరి ఏదో వేడుక చేసుకుంటున్నా రని, ప్రబోధుడు ఊహించాడు. అతడు వాళ్ళ దగ్గిరకు పోయాడు.

గుంపు మధ్య ఒక వ్యక్తి, వెదురుతో చేయబడి, పూలతో అలంకరించబడిన ఒక ఉన్నతాసనం మీద కూర్చుని వున్నాడు. అతడి తల మీద సువాసనలు వెదజల్లే పువ్వులతో అలంకరించబడిన కిరీటం వున్నది.

అతడు ప్రబోధుణ్ణి చూస్తూనే లేచి వచ్చి, అతడికి నమస్కరించి, "స్వామీ, నేను అగ్నిశిఖుడిని! ఈ ఆటవికులు రాజును ఎన్నుకునేందుకు, తమ సాంప్రదాయం ప్రకారం, చిలుకను ఎగురవేశారు. అది వచ్చి, నా తల మీద వాలింది. నన్ను రాజును చేశారు. ఇదంతా మీ చలవ; కాశీవిశ్వేశ్వరుడు ప్రసాదించిన పుణ్య ఫలం," అన్నాడు.

తరవాత ప్రబోధుడు, అగ్నిశిఖుడికి ఒక్కపూట అతిథిగా వుండి, మరి కొంత దూరం ప్రయాణం చేసి, చెప్పులు కుట్టుకునే కాళిదాసు వుండే గ్రామం చేరాడు. అతడికి లోగడ తాను చూసిన మర్రి చెట్టుకు కొద్ది దూరంలో, ఒక చెప్పుల దుకాణం కనిపించింది. అందులో విలువైన దుస్తులు ధరించిన ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు.

ప్రబోధుడు అతణ్ణి సమీపించి, "అయ్యా, ఈ ప్రాంతాన కాళిదాసు అనే చెప్పులుకుట్టే అతను వుండాలి. మీకు అతను తెలుసా?" అని అడిగాడు.

వెంటనే ఆ వ్యక్తి ప్రబోధుడికి సాష్టాంగ పడి లేచి, "స్వామీ, ఆ కాళిదాసును



నేనే! కొన్ని నెలల కిందట, మహారాజు గారు, ఈ దారినే వెళుతూ, నే కుట్టిన చెప్పుల పనితనం చూసి కొన్నారు. ఆ రోజుతో, నా జాతకం మారిపోయింది. ఇప్పుడు రాజ్యంలోని ప్రముఖు లందరూ, నేను తయారు చేయిస్తున్న చెప్పులే కొంటున్నారు. ఇదంతా, మీ దయ; కాశీ విశ్వేశ్వరుడు యిచ్చిన పుణ్యఫలం!'' అన్నాడు.

తన కారణంగా ముగ్గురికి తక్షణమే పుణ్యఫలందక్కి, వాళ్ళ పరిస్థితి మెరుగైనందుకు, ప్రబోధుడు చాలా సంతోషించాడు. కాని, తన పరిస్థితి ఏమిటి? స్వయంగా కాశీవిశ్వేశ్వరుణ్ణి దర్శించిన తనకు, కొద్దిపాటి పుణ్యఫలం కూడా దక్కినట్టులేదు. తను శాంతివనం చేరి, గురువుకు శుశ్రూషలు చేస్తూ, అలా విద్యాభ్యాసం చేస్తూ కాలం గడపవలసిందే!

అతడు శాంతివనానికి తిరిగి వచ్చాక, ఋషి జీవానందుడికి జరిగినదంతా చెప్పి, తన అనుమానాన్ని వెల్లడించాడు.

జీవానందుడు అంతా సావధానంగా విని, ''ప్రబోధా, నువ్వు దారి ఖర్చులకని కొంత ధనం వెంట తీసుకుపోయావు. దాన్ని దొంగ అగ్నిశిఖుడు దోచుకున్నాడు. మరి నువ్వు కాశీ చేరేవరకూ, నీ ఆకలి ఎలా తీర్చుకున్నావు?'' అని అడిగాడు.

''గురుదేవా, నేను కాశీనగరంలో అడుగు పెట్టేవరకూ, అగ్నిశిఖుడిచ్చిన ధనంలో చిల్లిగవ్వ కూడా ఖర్చుపెట్టలేదు.





అరణ్య ప్రాంతాల వెళ్ళేప్పుడు కంద మూలాలూ, దొరికినపళ్ళూ తిని ఆకలి చల్లార్చుకున్నాను. గ్రామ సీమల్లో ప్రయాణించేటప్పుడు, ఏ గృహస్థు యింటనో, ఆతిథ్యం దొరికేది. కాశీ ప్రవేశించాకే, అగ్నిశిఖుడిచ్చిన ధనంలో కొంత ఖర్చు చేశాను," అన్నాడు ప్రబోధుడు.

"అలా ఎందుకు జరిగింది?" అని ప్రశ్నించాడు జీవానందుడు.

"నగరంలో కొందరు తీర్థయాత్రికులు కలిశారు. వాళ్ళు ఒక ధర్మసత్రం నుంచి మరొక చోటుకు పోతున్నారు. కారణం అడిగాను. ఆ సత్రంలో భోజనవసతి సౌకర్యాలు ఏమీ బాగోలేవనీ, మరొకచోట వున్న వసతిగృహంలో, కొద్దిపాటి డబ్బు తీసుకుని, మంచి సౌకర్యాలు కలిగిస్తారనీ చెప్పి, నన్ను కూడా రమ్మని ప్రోత్సహించారు. వాళ్ళతోపాటు, ఆ వసతి గృహానికి వెళ్ళాను. దాని యజమానికి కొంత ధనం చెల్లించవలసి వచ్చింది. ఆ విధంగా, అగ్నిశిఖుడు విశ్వేశ్వరుడి హుండీలో వేయమని యిచ్చిన నూరు వరహాలలో కొంత ఖర్చయిపోయింది," అన్నాడు ప్రబోధుడు.

జీవానందుడు చిరునవ్వు నవ్వి, "ప్రబోధా, అదే నువ్వు చేసిన తప్పు! అగ్నిశిఖుడు దొంగ; దొంగతనం అతడి వృత్తి. నీ దగ్గిరున్న సొమ్ము దోచుకోగానే, అది అతడిదవుతుంది. దాన్ని అతడికై అతడు కోరి, విశ్వేశ్వరుడి హుండీలో కానుకగా సమర్పించమని నీకిచ్చాడు. అయినా, నీది కాని ధనాన్ని నువ్వు కొంత ఖర్చు చేశావు. ఇప్పుడు, ఆ ముగ్గురికీ లభించిన పుణ్యఫలం, నీకు లభించ లేదని బాధపడుతున్నావు. అది పొరబాటు!" అన్నాడు.

"పొరబాటా! గురుదేవా, అదెలాగో సెలవివ్వండి," అన్నాడు ప్రబోధుడు.

జీవానందుడు ఒక క్షణం ఆగి, ఆప్యాయంగా ప్రబోధుడి భుజం తట్టి, "చెట్టు కింద కూర్చుని, ఎండనక, వాననక చెప్పులుకుట్టి జీవయాత్ర సాగించే కాళి

దాసు కటికదరిద్రుడు. అతడికి తక్షణమే పుణ్యఫలం లభించి, వాడి దారిద్ర్యబాధ వదిలిపోవలసిన అవసరం వున్నది. ఇక అగ్నిశిఖుడు: వాడు దారులుకొట్టి బతికే క్రూరకర్ముడు. అడగంగానే ధనం యివ్వని వాళ్ళ ప్రాణాలు తీయడానికి వెనుకాడడు. వాడికీ పుణ్యఫలం వెంటనే లభించి సన్మార్గానికి రాకపోతే, ఎందరో అమాయకులు వాడివల్ల ప్రాణాలు కోల్పోతారు. ఇక రుధిరవర్ణుడి సంగతి: వాడు పరమ భయంకరుడైన రాక్షసుడు. ఆకలి తీర్చుకోవడమే, వాడికి అన్నిటికన్న ముఖ్యం. అందువల్ల, వాడు కనిపించిన ఏ మనిషినైనా నిర్దాక్షిణ్యంగా తిని వేయగలడు. వాడికీ పుణ్యఫలం తక్షణమే లభించవలసిన అవసరం వున్నది. అలా కానప్పుడు, మరెందరో మనుషులు వాడి వాతపడగలరు. అర్థమైందా, ప్రబోధా?'' అని అడిగాడు.

''అర్థమైంది, గురుదేవా. కాని, ఇంకా నాకొక సందేహం. ఎంతో మార్గాయాసానికీ, ఎన్నో శ్రమలకూ ఓర్చి, కాశీవిశ్వేశ్వరుడి దర్శనం చేసుకున్న నేను, ఏపాటి పుణ్యఫలానికీ అర్హుణ్ణి కానా?'' అని అడిగాడు.

''ఎందుకాకవు, ప్రబోధా? ఒక దారిద్ర్యపీడితుడూ, ఒక దొంగా, ఒక రాక్షసుడిలా—ఆ పుణ్యఫలాన్ని మరుక్షణానే, నీవు పొందవలసిన అగత్యం లేదు. నీకు దారిద్ర్యబాధలేదు. నీది ఎవరికీ హాని కలిగించే మనస్తత్వం కాదు. ఇంకా విద్యార్థివి. ముందు, ముందు విశ్వేశ్వరుణ్ణి దర్శించిన పుణ్యఫలం తప్పక అనుభవిస్తావు!'' అని జీవానందుడు, ప్రబోధుణ్ణి ఆశీర్వదించాడు.

తరవాత కొంతకాలానికి ఋషి వాక్కు ఫలించింది. ప్రబోధుడు, జీవానందుడి వల్ల సర్వశాస్త్రాలూ నేర్చి, కౌముదీ రాజ్యంలో తనకు సాటిరాగల పండితుడు లేడన్న ఖ్యాతి గడించాడు. ఇది విన్న రాజు, అతణ్ణి ఆహ్వానించి రాజగురువు పదవి యిచ్చి, సన్మానించాడు.



# ఆధిక్యత

రామాపురం గ్రామస్థులకు, తమ ఊరిలోని రామాలయాన్ని బాగుచేయించాలన్న కోరిక కలిగింది. గ్రామ పెద్ద గోవిందయ్య వాళ్ళతో, "మనం ఒక చిన్న గానకచేరీ ఏర్పాటుచేద్దాం. వినడానికి వచ్చినవాళ్ళనుంచి చందాల రూపంలో కొంత డబ్బు రాబట్టవచ్చు," అన్నాడు.

గ్రామంలో శాస్త్రీయ సంగీతం నేర్చిన సారంగపాణి అనే యువకుడూ, సోమదత్తుడనే వైణికుడూ ఉన్నారు. వాళ్ళకు కచేరీ చేసినందుకు గౌరవ సూచకంగా నూటపదహార్లు ఇవ్వాలని నిర్ణయం జరిగింది. అందుకు సారంగపాణి వెంటనే ఒప్పుకున్నాడు.

సోమదత్తుడు మాత్రం, "అదేమిటి? విద్వత్తులో, ఆ కుర్రవాడూ, నేనూ ఒకటా? అతడికన్న నా ఆధిక్యత నలుగురికీ తెలిసే విధంగా, నాకు అతడికిచ్చిన దానికన్న, ఒక రూపాయి అధికంగా ఇవ్వాలి," అన్నాడు.

గోవిందయ్య అందుకు ఒప్పుకున్నాడు. వారం తరవాత గానకచేరీ ఏర్పాటయింది. అది ముగిశాక గోవిందయ్య, అక్కడ చేరినవాళ్ళతో, "మహాజనులారా! సారంగపాణికి ఇచ్చే పారితోషికం కన్న, తనకు ఒక్క రూపాయి అధికంగా కావాలన్నారు, సోమదత్తుడుగారు. దైవ కార్యం గనక, తనకు పారితోషికం అక్కరలేదని సారంగపాణి నిరాకరించాడు. అందువల్ల, సోమదత్తుడుగారికి ఒక రూపాయి యిస్తున్నాను," అని చెప్పాడు.

సోమదత్తుడు కిక్కురుమనకుండా తలవంచుకుని, గోవిందయ్య ఇచ్చిన రూపాయి తీసుకున్నాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్





# జ్వాలాద్వీపం

నర్మదానదీ తీరాన గల ధవళగిరి రాజ్యాన్ని తారకేశ్వరు డనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆయనకు ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడి పేరు శూర సేనుడు; అతడికి పాతికేళ్ళ వయసు. చిన్నవాడు పద్దెనిమిదేళ్ళవాడు; పేరు చిత్ర సేనుడు.

ఈ ఇద్దరు రాజకుమారులూ ఒకనాటి ఉదయం పరివారాన్ని వెంటబెట్టుకుని, వినోదార్థం వేటకై అడవికి వెళ్ళారు. అడవిలో కొంతదూరం పోయిన తరవాత, వాళ్ళకు ఒక లేళ్ళమంద కనిపించింది. రాజకుమారు లిద్దరూ తమతమ గుర్రాలను అదిలించి, ఆ లేళ్ళ గుంపుపై బాణాలు ప్రయోగిస్తూ, క్రమంగా తమ పరివారాన్నుంచి వేరుపడి అడవిలో చాలా దూరం వెళ్ళిపోయారు.

హఠాత్తుగా వారికి ఒక పొద చాటు నుంచి సింహం గర్జించిన ధ్వని వినబడింది. రాజకుమారు లిద్దరూ, ఆ ధ్వని వచ్చిన వైపుకు తలలు తిప్పి, బాణాలు ఎక్కుపెట్టే లోపలే, రెండు సింహాలు గర్జించుతూ వారికేసి దూకినై. సింహాలను చూస్తూనే రాజకుమారులు ఎక్కివున్న గుర్రాలు బెదిరి వెనుదిరిగి వేగంగా పారిపోసాగినై.

రాజకుమారులలో చిన్నవాడైన చిత్ర సేనుడు ఎక్కివున్న గుర్రం, యజమాని ఎంత బలంగా కళ్ళెం లాగినా ఆగక, చెట్ల సందు నుంచి బాణంలా దూసుకు



పోతూ, కొంతసేపటికి ఒకానొక కొండ ప్రాంతాన్ని చేరి, నురగలు కక్కుతూ కింద పడిపోయి ప్రాణాలు విడిచింది.

అసరికి చిత్రసేనుడు బాగా అలసి పోయి వున్నాడు. అతడు తన అన్నకోసం నలుమూలలా పరికించి చూశాడు. ఎక్కడా అతడి జాడ కనిపించలేదు. తను పరివారాన్ని వదిలి అడవిలో చాలాదూరం వచ్చినట్టు అతడికి తోచింది. ఆ ప్రాంత మంతా ఆకాశాన్నంటుతున్న పెద్దపెద్ద మానులతో, చీకటిమయంగా వున్నది. చెట్ల కొమ్మల్లో కోతులూ, రకరకాల పక్షులూ, ఊడల్లా వేలాడుతున్న పెద్ద సర్పాలూ అతడికి కనిపించినై.

ఈ పరిసరాలను చూసి చిత్రసేనుడు చాలా భయపడ్డాడు. తను పరివారాన్నుంచే కాక, మానవ నివాసాలుండే ప్రాంతాల కూడా దూరమైపోయినట్టు అతడు గ్రహించాడు. తను ధవళగిరి నగరాన్ని చేరాలంటే కాలినడకనే వెళ్ళాలి. ఆ నగరం ఏ దిక్కుగా వున్నదో కూడా ఆ క్షణంలో అతడికి తెలియదు.

చిత్రసేనుడు తన విషాద పరిస్థితికి వగుస్తూ, ఉన్నచోటు నుంచి కదిలి, అడవిలో కొద్ది దూరం నడిచేసరికి, చిన్న చిన్న తుప్పలతో, పొదలతో నిండి వున్న ఒక కొండ అతడికి ఎదురుగా కనిపించింది. ఆ కొండ పాదంలో చిన్న వాగొకటి ప్రవహిస్తున్నది. వాగులోని నీటిని చూడగానే, చిత్రసేనుడికి దాహంతో తన నాలుక పిడచకట్టుకుపోయి వుండటం తెలిసి వచ్చింది. అతడు వాగులో దిగి దాహం తీర్చుకున్నాడు.

దాహం తీర్చుకోగానే చిత్రసేనుడు కొంత సేద దేరాడు. అతడు వాగు ఒడ్డునే కూర్చుని ముందు కర్తవ్యం గురించి ఆలోచించసాగాడు. బహుశా తన అన్న శూరసేనుడు కూడా తనలాగే, సింహాల వాతపడకుండా తప్పించుకుని వుంటాడు. బెదిరి పరిగెత్తిన అతడి గుర్రం కూడా, అతణ్ణి ఈ ప్రాంతాలకే తెచ్చి వుండ

వచ్చున్న అనుమానం చిత్రసేనుడికి కలిగింది.

ఆ వెంటనే అతడు వాగు ఒడ్డున లేచి నిలబడి, ఎలుగెత్తి పెద్దగా, "అన్నా, శూరసేనా!" అని కేకపెట్టాడు.

చిత్రసేనుడి కేక చెట్లలో, కొండగుహల్లో మార్మోగిన మరుక్షణాన, వాగు అవతల వున్న ఒక గుహలో నుంచి, "ఎవరూ? ఈ ప్రాంతాల మానవ కంఠస్వరం పలికిందా! ఎంత అదృష్టవంతుడివిరా నాయనా, ఒకసారి నా దగ్గరకు రా!" అన్న పిలుపు చిత్రసేనుడికి వినిపించింది.




గుహలో నుంచి వచ్చిన ఆ పిలుపు వింటూనే చిత్రసేనుడు తుళ్లిపడి, అంతలోనే ధైర్యం తెచ్చుకుని, ఖంగుమనే కంఠస్వరంతో, "ఎవరు నీవు? రాక్షసుడివా? లేక నరమాంస భక్షకుడివైన కిరాతుడివా? గుహ నుంచి బయటికి రా, నా కత్తికి ఎర చేస్తాను," అన్నాడు.

చిత్రసేనుడు మాటలు ముగించక ముందే, గుహలో నుంచి చిత్రమైన నవ్వూ, ఆ వెంటనే, "ఎంత సాహసివిరా, వత్సా! నీ వంటి ధైర్యశాలి కోసమే నేను ఎదురు చూస్తున్నాను. నేను మనిషి మాంసం తినే కిరాతుణ్ణీ కాదు, రాక్షసుణ్ణీ కాదు, ఒకానొక సిద్ధుణ్ణి. నేను ఇంత కాలంగా శ్రమల కోర్చి సంపాయించిన ఒక అమూల్య వస్తువును ఇప్పుడు నీ కివ్వబోతున్నాను." అన్న మాటలూ వినిపించినై.

చిత్రసేనుడు చిటికల మీద ఓ నిర్ణయానికి వచ్చాడు. ఆ గుహలో ఉన్నది రాక్షసుడే అయితే, తను ఇక్కణ్ణుంచి ప్రాణాలతో ఎలానూ తప్పించుకుపోలేడు; కనక, రాక్షసుడితో పోరాడుతూ ప్రాణాలు వదలటమే క్షత్రియ ధర్మం అనుకున్నాడు. ఒకవేళ గుహలో ఉన్నది నిజంగా సిద్ధుడే అయితే, తనకు కలగబోయే కీడు ఏమీ వుండదు.

ఈ నిశ్చయానికి రాగానే చిత్రసేనుడు ఒర నుంచి కత్తి దూసి, మోకాటి లోతున్న



వాగు నీటిలో దిగి, అవతలి ఒడ్డుకు చేరాడు. అక్కడ కొండలలో చాలా గుహలున్నవి. అందువల్ల తనను పిలిచిన వ్యక్తి ఏ గుహలో వున్నదీ చిత్రసేనుడికి తెలియరాలేదు. అతడు ఒక్కొక్క గుహ దగ్గిరకు వెళ్ళి లోపలికి తొంగి చూడసాగాడు. అంతలో అతడికి దాపుల నున్న ఒక గుహ నుంచి, "నాయనా, భయపడకు. ఇటు రా!" అన్న మాటలు వినిపించినై.

చిత్రసేనుడు కత్తిని మరింత గట్టిగా గుప్పెట బిగించి, ఆ పిలుపు వచ్చిన గుహ ముందుకు వెళ్ళి లోపలికి తొంగి చూశాడు. గుహలో అతడికి ఒక సిద్ధుడు కనిపించాడు. అతడి తలా గడ్డమూ తెల్లగా నెరిసి వున్నవి. అతడు గుహ మధ్య ఒక ఎత్తయిన వేదిక మీద కూర్చుని వున్నాడు. గుహ పై భాగాన వున్న కంతల నుంచి సూర్యకాంతి లోపల పడుతూండడంవల్ల, గుహ లోపలి భాగం వెలుతురుగా వున్నది.

ముసలి సిద్ధుణ్ణి చూస్తూనే చిత్రసేనుడు తను అంతకు ముందు పరుషంగా మాట్లాడినందుకు నొచ్చుకున్నాడు. అతడు కత్తిని ఒరలో పెట్టి, సిద్ధుణ్ణి సమీపించి చేతులెత్తి నమస్కరిస్తూ, "మహాత్మా, నన్ను క్షమించవలసిందిగా వేడుతున్నాను," అన్నాడు ఎంతో వినయంగా.

చిత్రసేనుడి మాటలకు సిద్ధుడు చిరునవ్వు నవ్వి, "నాయనా, నువ్వు సుక్షత్రియుడివిలా కనబడుతున్నావు. అరవై సంవత్సరాల నా తపశ్శక్తినంతా ధారపోసి ఒక అపూర్వ వస్తువును సాధించాను. కాని, దాన్ని అనుభవించే యోగ్యత నాకు లేదు. నేను దాన్ని సాధించే ప్రయత్నంలో ముసలివాణ్ణయిపోయాను. నాకీ రాత్రి అష్టమి చంద్రుడు అస్తమించే సమయాన మరణం సిద్ధించనున్నది. నేను ఇన్ని శ్రమల కోర్చి సాధించిన ఆ అపూర్వ వస్తువును యోగ్యుడైన వాడికెవడికైనా ఇచ్చి పోదామని చాలా రోజులుగా

చూస్తున్నాను. నా తుది ఘడియల్లో నీ అదృష్టం నిన్ను నా దగ్గిరకు లాక్కు వచ్చింది. ఇదుగో, ఆ అపూర్వ వస్తువు!'' అంటూ పక్కనే వున్న ఒక వెదురు బుట్టను చిత్రసేనుడికి ఇచ్చాడు.



చిత్రసేనుడు సిద్ధుడి నుంచి బుట్ట అందుకుని ఆత్రంగా దాని మూతను తెరవ బోయేంతలో, సిద్ధుడు తన దండంతో బుట్ట మూతను గట్టిగా అదిమి, ''నాయనా, తొందరపడి బుట్ట మూతను ఇక్కడ తెరవకు. నీవు ఏ ప్రాంతాల అయితే, నివసించటానికి మక్కువ పడతావో, ఆ ప్రాంతాన దాన్ని తెరిచి చూడటం నీకు క్షేమ కారణం అవుతుంది,'' అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడు చెప్పిన దానికి అంగీకార సూచకంగా తలాడించి, ''మహాత్మా, మీ దయకు కృతజ్ఞుణ్ణి. నా నుంచి మీరు ఎలాంటి సేవా శుశ్రూషలు కోరినా, చేయటానికి సిద్ధంగా వున్నాను,'' అన్నాడు.

ఈ మాటలకు సిద్ధుడు నవ్వి, ''నాయనా, నీ నమ్రతా, భక్తీ చూసి నాకు చాలా ఆనందం కలుగుతున్నది. ఇక కొద్ది ఘడియల్లోనే నేను మరణించ బోతున్నాను. అలాంటి నాకు నీవు చేయ గల సేవ ఏమీ లేదు. కాని, నీకు ఒక్క చిన్న పని మాత్రం చెపుతున్నాను. నీవు గుహ నుంచి బయటికి వెళ్లిన తరవాత, గుహకు తూర్పు వైపున కోణాకృతిలో వున్న రాతిని కిందకు లాగు. అదే నీవు చేయగల ప్రత్యుపకారం,'' అన్నాడు.

చిత్రసేనుడు సిద్ధుడికి నమస్కరించి గుహ నుంచి బయటికి వచ్చి, అతడు చెప్పిన రాతిని రెండు చేతులతోనూ బలంగా పట్టి కిందకు లాగాడు. వెంటనే కొండ దద్దరిల్లేలా పెద్ద చప్పుడయింది, గుహ ముందు భాగాన్ని, పై నుంచి జారి పడిన ఒక బల్లపరుపు రాయి గుర్తు తెలియని విధంగా కప్పేసింది.

చిత్రసేనుడు అక్కడ కొద్దిసేపు నిల బడి తరవాత నెమ్మదిగా వాగు దాటి

అరణ్యంలో ప్రవేశించాడు. తను నగరం చేరాలంటే ఏ దిక్కుగా పోవాలో కూడా అతడికి తెలియదు. ఆ కారణంగా అతడు చెట్లలో సునాయాసంగా నడవటానికి అనువైన మార్గాలగుండా నడవసాగాడు. ఇలా కొంతసేపు నడిచేసరికి అతడికి సూర్యుడు పడమటి దిక్కుకు వాలటం కనిపించింది. క్రమంగా అతణ్ణి ఆకలి దహించ సాగింది.

ఆయాసపడుతూ చిత్రసేనుడు అడవిలో మరి కొంత దూరం నడిచి, అంతగా చెట్లు లేని ఒక ఎత్తయిన ప్రదేశాన్ని చేరాడు. అక్కడ కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్న తరవాత, హఠాత్తుగా అతడి దృష్టి భుజాన వేలాడుతున్న బుట్ట మీదికి ప్రసరించింది. అందులో వున్నదని సిద్ధుడు చెప్పిన అపూర్వ వస్తువేమిటో చూడాలన్న కోర్కె అతడికి కలిగింది. ఆ క్షణాన చిత్రసేనుడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక గుర్తుకు రాలేదు.

అతడు భుజాన్నుంచి బుట్టను కిందికి దించి, దాని మూతను పైకెత్తి ఆత్రంగా లోపలికి చూశాడు. వెంటనే అతడి కళ్ళలో మెరుపు మెరిసినట్టయింది. చిత్రసేనుడు కళ్ళు మూసి తిరిగి తెరిచేసరికి, ఎదురుగా చెట్లలో ఆకాశాన్నంటుతున్నట్టున్న పెద్ద భవనం ఒకటి కనిపించింది.

ఈ అద్భుత దృశ్యం చూసి చిత్రసేనుడు శిలాప్రతిమలా అయిపోయాడు.



ఆ మరుక్షణం అతడికి సిద్ధుడు చేసిన హెచ్చరిక గుర్తుకొచ్చింది. "అయ్యో, నే నెంత మూర్ఖుణ్ణి! ఈ మహారణ్యం మధ్య ఈ దివ్యభవనం నాకెందుకు పనికి వస్తుంది? ఇదే ధవళగిరి నగరంలో వున్నట్టయితే ఎంతగా రాణించేది! నా బుద్ధిహీనతవల్ల, సిద్ధుడు చేసిన ఇంత మేలూ అరణ్యంపాలు చేశానే!" అంటూ దుఃఖపడసాగాడు.

ఆ స్థితిలో వున్న చిత్రసేనుడికి అరణ్యం మధ్యనుంచి పెడబొబ్బలు వినిపించినై. చూస్తూండగానే చెట్లు పెనుగాలి తగిలి నట్టు వూగసాగినై. చిత్రసేనుడు ఆశ్చర్య పడుతూ చుట్టూ చూసేంతలో, అడ్డం వచ్చిన పెద్ద పెద్ద చెట్లను చేతులతో పడదోస్తూ, ఒక రాక్షసుడు అతడికేసి రావటం కనిపించింది. చిత్రసేనుడు లేచి నిలబడి కత్తి దూశాడు.

రాక్షసుడు వికటాట్టహాసం చేస్తూ అతణ్ణి సమీపించి, "ఏమిరా కుర్రా, నీ ధైర్య సాహసం! ఈ ఉగ్రాక్షుణ్ణి చూస్తూనే, నరమానవుడైనవాడు అక్కడికక్కడే ప్రాణాలు వదలటం ఎరుగుదును గాని, నీలా కత్తి దూసి నిలబడ్డవాడు ఈనాటి వరకూ నాకు తారసపడలేదు," అంటూ వెనుదిరిగి వింత భవనం కేసి చూస్తూ, "ఆ బొమ్మరిల్లు నీవు కట్టిందేనా?" అని ప్రశ్నించాడు.

"అవును," అన్నాడు చిత్రసేనుడు తొణక్కుండా.



ఆ ప్రత్యుత్తరం వింటూనే ఉగ్రాక్షుడు, 'అహ్హహ్హ' అంటూ చెట్ల ఆకులు రాలి పడేలా నవ్వి, "ఈ అడివిని, నీ ముత్తాత నాటి నీళ్ళు పోసి పెంచాడనా నువ్వనుకునేది? జాగర్త. ఇది ఉగ్రాక్షుడి అడవి! నా అనుమతి లేకుండా దీని మధ్య ఇల్లు కట్టావు గనక, నిన్నూ ఆ ఇంటినీ కట్టకట్టి ఆ కొండ అవతలికి విసిరేస్తాను," అంటూ వంగి చిత్రసేనుణ్ణి పట్టుకోబోయాడు.

చిత్రసేనుడు రాక్షసుడికి అందకుండా తప్పుకుని, "తొందరపడకు, ఉగ్రాక్షా! నే నిక్కడ ఇల్లు కట్టినందువల్ల నీకొచ్చిన నష్టమేమిటి? కావాలంటే, ఆ ఇల్లు నీకు వదిలి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

"అదేం కుదరదు. నా అడివిలో నన్ను ధిక్కరించి ఇల్లు కట్టావు. నీవు ప్రాణాలతో బయటపడాలంటే, నే నడిగేదానికి ఒప్పుకోవాలి," అన్నాడు ఉగ్రాక్షుడు.

"ఏమిటదీ?" అని ప్రశ్నించాడు చిత్రసేనుడు.

"నువ్వీ ఇంట్లోనే సుఖంగా బతుకు, నా అభ్యంతరం లేదు. నీకు పుట్టబోయే పిల్లల్లో పెద్దవాణ్ణి పద్దెనిమిదో ఏడు రాగానే, నా పరం చెయ్యి," అన్నాడు ఉగ్రాక్షుడు.

రాక్షసుడి కోర్కె చిత్రసేనుడికి చాలా వింతగా కనిపించింది. తన కింకా పెళ్ళే కాలేదు! అలాంటప్పుడు రాక్షసుడు అడిగినదానికి సరేనంటే పోయేదేమిటి? తను కనీసం ప్రాణాలతోనన్నా, ఇక్కణ్ణించి బయటపడవచ్చు.

చిత్రసేనుడు ఇలా ఆలోచించి, "ఉగ్రాక్షా, నీ వడిగినదానికి ఒప్పుకుంటున్నాను. నా పెద్దకొడుక్కు పద్దెనిమిదో ఏడు రాగానే నువ్వొచ్చి వాణ్ణి నిరభ్యంతరంగా తీసుకుపోవచ్చు," అన్నాడు.

రాక్షసుడు ఈ ప్రత్యుత్తరం విని ఎంతో పొంగిపోతూ, "అయితే, నిన్ను ప్రాణాలతో వదులుతున్నాను. నువు మాత్రం నాకు ఇచ్చిన మాటనిలుపుకో," అంటూ వెళ్ళిపోయాడు. —(ఇంకావుంది)






# లోపం ఎవరిది?

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ శ్మశానంలో భయంకరమైన అర్ధరాత్రి వేళ, నువ్వు యింత కఠోరమైన శ్రమల పాలవడం, నీ స్వబుద్ధితో ఆలోచించి చేస్తున్నదా? లేక పరుల ప్రోత్సాహమా అన్న సందేహం నన్ను బాధిస్తున్నది. పరబుద్ధి ప్రాణాంతకమన్న పెద్దలవాక్కు నీకు తెలియంది కాదు గదా. కాని, వివేకవంతులైన వాళ్ళు కూడా, ఆ సంగతి మరిచి, ఒక్కొక్కసారి స్వబుద్ధిని కాదని అపహాస్యం పాలవుతారు. ఇందుకు ఉదాహరణగా, ఒక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



సువర్ణదేశాన్ని శశాంకు డనే రాజు పాలించేవాడు. అయన భార్య సునంద గొప్ప అందగత్తె. రాజుకు ఆమె అంటే వల్లమాలిన ప్రేమ. అడిగినదే తడవుగా, అమె కోరే ప్రతి వస్తువూ, ఎంత వ్యయ ప్రయాసలకయినా సంశయించక, తెప్పించి ఇచ్చేవాడు.

సునంద ముఖ్యంగా వస్త్రధారణపట్లా, ఆభరణాల విషయంలోనూ ప్రత్యేకమైన శ్రద్ధ చూపించేది. అందుచేత శశాంకుడు, ఆమె అవసరాలు తీర్చడానికి, దేశదేశాల నుంచి నేతగాళ్ళనూ, స్వర్ణకారుల్నీ రప్పించి, తన ఆస్థానంలో అట్టే పెట్టుకున్నాడు. వారిలో చందను డనే నేతగాడూ, శోణకు డనే స్వర్ణకారుడూ అసమానమైన ప్రతిభావంతులు. వారి పేరు ప్రఖ్యాతులు సువర్ణదేశంలోనే కాక, చుట్టుపక్కల రాజ్యాలలో కూడా మారుమోగుతూండేవి.

శశాంకుడు ఏటా రాణి జన్మదినం అతి వైభవంగా జరిపేవాడు. ఆ సందర్భంగా, రాణికి కావలసిన వస్త్రాలనూ, నగలనూ చందనుడూ, శోణకుడూ ప్రత్యేకంగా తయారు చేసి ఇచ్చేవాళ్ళు. ఆ ఇద్దరూ ఒకసారి చేసిన నమూనాను, మరొకసారి ఉపయోగించే వాళ్ళు కాదు. అటువంటి పనితనం మానవమాత్రులకు సాధ్యపడేది కాదని, రాజప్రాసాదంలో అందరూ చెప్పుకునేవాళ్ళు.

శశాంకుడికి, సారంగు డనే ఆప్తమిత్రు డొకడున్నాడు. రాజు తాను తీసుకునే ముఖ్యమైన నిర్ణయాలన్నీ—పరిపాలనకు సంబంధించినవైనా, లేక వ్యక్తిగతమైనవైనా, ముందుగా సారంగుడికి చెప్పేవాడు. అయితే, సారంగుడు ఏనాడూ నోరు విప్పేవాడు కాదు; తల వూపి వూరుకునేవాడు. ఇది మకరందు డనే మంత్రికి ఆశ్చర్యంతోపాటు కుతూహల కారణంగా కూడా వుండేది.

ఒకనాడు అతడు శశాంకుణ్ణి, "మహారాజా, మంత్రిని నేనుండగా, ముఖ్యమైన

విషయాలన్నీ మీరు, సారంగుడితో ప్రస్తావిస్తూంటారు. ఆయన, నేను చూస్తూండగా ఏనాడూ మీకు సలహా ఇవ్వలేదు. అయినా, మీరు ఆయనతో సంప్రదిస్తూండడంలోని అంతర్యమేమిటో, నాకు బోధపడడం లేదు,'' అని అడిగాడు.

ఇందుకు శశాంకుడు, ''సారంగుడి తత్వం, నాకు బాగా తెలుసు. అతడు మౌనంగా వుండలేనప్పుడే, నోరు విప్పుతాడు. అందుచేత, అతడి అభిప్రాయం మాటల ద్వారానే వినాలన్న అవసరం లేదు,'' అన్నాడు.

ఆ తర్వాత కొన్నాళ్ళకు, రాణి జన్మదినం వచ్చింది. చందనుడూ, శోణకుడూ యథాప్రకారం రాణికి వస్త్రాలూ, ఆభరణాలూ ప్రత్యేకంగా తయారు చేసి పంపించారు. అయితే, రాణి అవి తనకు తగినట్టుగా లేవని తిప్పి పంపింది.

ఇది విని రాజుకు చాలా ఆశ్చర్యం కలిగింది. ఆయన చందనుణ్ణీ, శోణకుణ్ణీ, పిలిపించి, మహారాణి తనకు నచ్చినవైనంతవరకూ, కొత్త కొత్త నమూనాలు తయారు చేసి చూపించవలసిందిగా ఆదేశించాడు.

అయితే, వాళ్ళిద్దరూ ఎంత ప్రయత్నించీ, రాణికి, నచ్చే విధంగా వస్త్రాలూ, ఆభరణాలూ తయారు చేసి ఇవ్వడంలో విఫలులయ్యారు.

రాజు శశాంకుడు కోపగించుకుని, వాళ్ళను, ''వయసు పైబడుతున్న కొద్దీ,





మీ పనితనం సన్నగిల్లుతున్నట్టు కనబడుతున్నది. మీలాంటి వాళ్ళతో, నాకు పని లేదు. నా అస్థానాన్ని విడిచి తక్షణమే వెళ్ళండి!'' అని ఆజ్ఞాపించాడు.

ఈ సంగతి రాజప్రాసాదంలోని అందరితోపాటు, సారంగుడికి కూడా తెలిసింది. ఆయన శశాంకుణ్ణి చూడవచ్చి, ''చందన, శోణకుల విషయంలో, మీరిచ్చిన ఆజ్ఞ గురించి విన్నాను. వాళ్ళ వయసు ప్రస్తావన తేవడం, ఏమంత సమంజసంగా లేదు. ఇన్నేళ్ళుగా వాళ్ళ నైపుణ్యం ఎటువంటిదో చూస్తున్న మనం, ఇప్పుడు దాన్ని గురించి సందేహపడడంలో అర్థంలేదు. మహారాణి, వాళ్ళు తయారుచేసిన వస్త్రాలూ, ఆభరణాలూ తనకు తగినట్టుగా లేవని తిరస్కరించడం సరికాదు. నా ఉద్దేశంలో, లోపం మరెక్కడో ఉన్నది! అది మనం తెలుసుకోవాలి. వాళ్ళిద్దర్నీ అస్థానం వదిలి పొమ్మనడం, దేశబహిష్కరణతో సమానం. ఇది సరిఅయిన నిర్ణయంగా, నాకు తోచడంలేదు,'' అన్నాడు.

రాజు, సారంగుడు చెప్పినది మౌనంగా విని, అంతఃపురానికిపోయి, రాణికి ఆయన మాటలు వివరించాడు.

రాణి సునంద కొంచెంసేపు ఆలోచిస్తూ ఊరుకుని, తరవాత భర్తతో, ''మీ ఆప్త మిత్రుడు సారంగుడు, నాకళ్ళు తెరిపించాడు. ఆ చందన శోణకులకు, అస్థాన బహిష్కారంకాక, నిండు సభలో ఘనంగా సత్కరించండి. ఇది నా కోరిక!'' అన్నది.

రాణి కోరిక విని, రాజు శశాంకుడు విస్తుపోయాడు. ఆమె కోరికను తోసిపుచ్చలేక, ఆ సంగతి మంత్రికి చెప్పి, చందనశోణకులను తగు విధంగా సత్కరించేందుకు ఏర్పాట్లు చెయ్యమన్నాడు.

రాజాజ్ఞ మంత్రికి చాలా ఆశ్చర్యం కలిగించింది. శిక్షించడానికి బదులు, సత్కరించాలన్న రాజు నిర్ణయం మంత్రులలోనూ, అస్థాన సభికులలోనూ అపహాస్యం పాలయింది.

ఏమయితేనేం—వారం తిరక్కుండానే చందన, శోణకులకు రాజ సన్మానంతో పాటు, విలువైన బహుమతులు కూడా లభించినై.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, భర్తద్వారా సారంగుడు అన్న మాటలు విన్న రాణి, అంతలోనే తన బుద్ధి మార్చుకోవడానికి కారణం ఏమిటి? సారంగుడు తన భర్తకు మిత్రుడు గనక, అతడికికోపం తెప్పించడం మంచిదికాదనా? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాణీలో వచ్చిన మార్పుకు, నువ్వు చెప్పినవేవీ కారణాలుకావు. సారంగుడు, చందన శోణకులను మంచి నిపుణులనడమేకాక—లోపం వాళ్ళ పనితనంలో లేదనీ, మరెక్కడో వున్నదనీ అన్నాడు. ఆయన సూచనప్రాయంగా చెప్పదలచినదేమిటో, రాణి అర్థం చేసుకున్నది. అదేమంటే; ఎవరికైనా వయసుతోపాటు, అనుభవం పెరుగుతుంది. అది పెరిగినకొద్దీ కళాకారుల నేర్పరితనం కొత్త మెరుగులు దిద్దుకుంటుంది. కాని, క్షీణించే తత్వం గల మానవ శరీరం మాత్రం, వయసు పెరుగుతున్న కొద్దీ వాసి తగ్గుతూ వెలవెలపోతుంది. అటువంటప్పుడు, చందన శోణకులు తయారుచేసిన వస్త్రాలూ, ఆభరణాలూ, రాణి తనకు తగినట్టుగా లేవనుకోవడంకన్న, తన ఆకారం, రూపురేఖలూ వాటికి తగినట్టుగా వున్నవా? అన్న ఆత్మపరీక్ష చేసుకుని వుండవలసింది. సారంగుడు అన్న మాటలు విన్న తర్వాత, రాణికి ఆ సత్యం తెలిసివచ్చింది. లోపం వాళ్ళు తయారుచేసిన వస్తువులలో లేదనీ, వయసు పైబడి వన్నె తగ్గుతున్న తన రూపానిదనీ, ఆమె అర్థం చేసుకున్నది. అందువల్లనే, ఆ కళాకారులను సన్మానించమని భర్తను కోరింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# రాజోద్యోగి ఎన్నిక

లక్షణదేశాన్ని సుకేతు డనే రాజు పాలిస్తూండేవాడు. ఆయనకు మంత్రులతో పాటు, రాజగురువు లక్ష్మీనాథపండితుడు కూడా తరచూ సమయోచితంగా సలహా లిచ్చి, పరిపాలనలో ఎంతగానో సాయ పడుతూండేవాడు.

ఒకసారి సుకేతుడు కొత్తగా ఒక పదవిని కల్పించి, ఆ పదవిలో మంచి అర్హుడైన వ్యక్తిని నియమించదలిచాడు. ఆ పదవీబాధ్యత నిర్వహించేవాడు, రాజు గారికి ముఖ్య సలహాదారుగా వుంటాడు. అతడు అమితమేధావి అయి వుండి, ప్రభుత్వంలోని కీలక శాఖల పని తీరును పర్యవేక్షిస్తూ వుండాలని సుకేతుడు అభిప్రాయపడ్డాడు.

అంత ప్రాముఖ్యత గల పదవిలో నియ మించబడే వ్యక్తి ఎన్నిక, అత్యంత సమర్థు లైనవారి ద్వారా జరగాలి. అభ్యర్థుల్ని అనేక రంగాలకు సంబంధించిన ప్రశ్నలు అడగడానికి, ఆయా రంగాలలో పేరు పొందిన అనుభవజ్ఞుల్ని నియమించాడు, సుకేతుడు. వారిలో లక్ష్మీనాథపండితుడు కూడా వున్నాడు.

కేవలం శాస్త్రజ్ఞానానికి సంబంధించిన ప్రశ్నలే అభ్యర్థుల్ని అడగాలన్న రాజు అభిప్రాయం విని, లక్ష్మీనాథపండితుడు ఆయనతో, "సుకేతా, ప్రభుత్వంలోని కీలక పదవి నిర్వహించే వ్యక్తికి, మేధస్సుతో పాటు, నైతికమైన కొన్ని అర్హతలు వుండాలి. అంతేకాక, ఇంటా—బయటా కూడా ఎలా ప్రవర్తించాలన్న విషయం కూడా తెలియాలి. అందుచేత అభ్యర్థుల మేధాశక్తిని పరీక్షించడం అయిన తర్వాత, చివరగా వాళ్ళను నేను నాలుగు ప్రశ్నలు అడుగుతాను. వాటికి సరిఅయిన సమా ధానాలిచ్చిన అభ్యర్థి, ఆ పదవికి

లక్ష్మీగాయత్రి

సంపూర్ణార్హత గల వాడవుతాడు.'' అని చెప్పాడు.

రాజగురువు చెప్పినదానికి సుకేతుడితో సహా అందరూ ఆమోదం తెలిపారు.

వారం రోజుల తర్వాత మహారాజు ముఖ్య సలహాదారు పదవికి అభ్యర్థి ఎన్నిక ప్రారంభమయింది. అనేక రంగాల్లో తలలు పండిన మేధావులందరూ, అభ్యర్థులను రకరకాలుగా ప్రశ్నించాక, లక్ష్మినాథ పండితుడు వాళ్ళను ఇలా ప్రశ్నించాడు:

హరించలేని ధనాన్ని హరించేదేది?

భార్యకైనాసరే తెలియజేయరానిదేది?

అనర్థమును కలుగజేయునదేది?

ఒక ముఖ్య రాజోద్యోగికి వుండవలసిన అర్హతలూ, ప్రవర్తనాసరళీ ఏమిటి?

అన్ని పరీక్షలలో నెగ్గినవారు కూడా లక్ష్మినాథపండితుని ప్రశ్నలకు సరైన సమాధానాలు చెప్పలేక తడబడసాగారు. ముఖ్యంగా హరించలేని ధనమని చెప్పిన దాన్ని, మళ్లీ హరించడమేమిటో, అభ్యర్థులను పరీక్షిస్తున్న మిగిలినవారికి కూడా అవగతం కాలేదు.

లక్ష్మినాథపండితుడి ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేక, చాలామంది అభ్యర్థులు తిరుగుముఖం పట్టారు. అది చూసి, పదవికి తగిన అభ్యర్థే లేడా అని సుకేతుడు ఆందోళనపడసాగాడు. అయితే, ఆ సమయంలో కాశీనగరంలో శాస్త్రాధ్యయనం చేసిన విశ్వనాథు డనే యువకుడు ముందుకు వచ్చాడు. అతడి ప్రాయం



చూసి తక్కువగా అంచనా వేసిన వారం దరినీ ఆశ్చర్యపరుస్తూ, అతడు ఇతర మేధావులు పెట్టిన అన్ని పరీక్షల్లోనూ నెగ్గాడు.

లక్ష్మీనాథపండితుడు, విశ్వనాథుణ్ణి నాలుగు ప్రశ్నలూ అడిగాడు.

దానికి అతడు, "హరించలేని ధనం— అంటే, దొంగలు దొంగిలించలేని ధనం జ్ఞానధనం. దాన్ని హరించునది—అంటే, నశింపచేయునది, అహంకారం!" అని జవాబిచ్చాడు.

అది విని లక్ష్మీనాథపండితుడు సంతోషంగా, "బాగా చెప్పావు! భార్యకైనాసరే తెలియజేయరానిదేది?" అని అడిగాడు.

అందుకు విశ్వనాథుడు, "రహస్యం!" అన్నాడు.

"భేష్! నా మూడవ ప్రశ్న. అనర్థాన్ని కలుగజేసేదేది?" అన్నాడు లక్ష్మీనాథ పండితుడు.

"మితిమీరినదేదైనా అనర్థాన్ని కలుగ జేస్తుంది," అన్నాడు విశ్వనాథుడు.

"సరైన జవాబు! ఇప్పుడు నా చివరి ప్రశ్న. ఒక ముఖ్య రాజోద్యోగికి వుండ వలసిన అర్హతలూ, ప్రవర్తనా సరళీ ఏమిటి?" అని అడిగాడు లక్ష్మీనాథ పండితుడు.

దానికి విశ్వనాథుడు చిన్నగా నవ్వి, "మీరింతకు ముందు అడిగిన మూడు ప్రశ్నలకు ఇచ్చిన జవాబులే, ఈ నాలుగవ ప్రశ్నకు. జవాబు. ముఖ్యపదవిలో వుండే వ్యక్తి, అహంకారదూరుడై, స్వజనానికైనా ప్రభుత్వ రహస్యాలు తెలియనివ్వకుండా, ప్రతి విషయంలోనూ ఉచితానుచితాలూ, పరిమితులూ తెలుసుకుని ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి!" అన్నాడు.

ఆ జవాబు విని లక్ష్మీనాథపండితుడితో సహా అందరూ, విశ్వనాథుణ్ణి మెచ్చుకున్నారు. రాజు సుకేతుడు అప్పటికప్పుడే అతణ్ణి, రాజలాంఛనాలతో ఘనంగా సన్మానించి, తనకు ముఖ్య సలహాదారుగా నియమించాడు.






మన దేవాలయాలు:

# చిదంబరం

ఒకానొకప్పుడు దారుకావనంలో మునుల ఆశ్రమం ఒకటి ఉండేది. ఆ ఆశ్రమం లోని మునులు తమ జ్ఞానాన్నీ, మహిమలు చూపడంలో తమకున్న అద్భుత శక్తినీ తలచుకుని అమితంగా గర్వపడ సాగారు. అందరిచేతా పూజలందుకునే అర్హత తమకున్నదని వారు భావించ సాగారు.

మునులుఆశ్రమంలో లేని సమయంలో, ఒక యువభిక్షువు చక్కగా పాడుతూ, కథలు చెబుతూ ఆశ్రమంకేసి వచ్చాడు. ఆ యువసన్యాసిని చూడగానే మునిపత్నులందరూ ఆయన కేసి ఆకర్షింపబడి చుట్టూ చేరారు.





ఆశ్రమానికి తిరిగి వచ్చిన మునులు, అక్కడి దృశ్యం చూసి ఆగ్రహం చెందారు. తమ పత్నులను రమ్మని పిలిచారు; బెదిరించారు. అయినా, ఏమాత్రం ప్రయోజనం లేకపోయింది. మునిపత్నులుగానీ, యువభిక్షువుగానీ, మునులకేసి తిరిగి చూడనైనాలేదు.




మునులు తమ అద్భుత శక్తులను ప్రయోగించడానికి పూనుకున్నారు. ఒక పెద్ద పులిని సృష్టించి యువభిక్షువు మీదికి పంపారు. పెద్దపులి అతి భీకరంగా గాండ్రిస్తూ, అతని మీదికి దూకసాగింది.

పులి సమీపించగానే, ఆ యువభిక్షువు దానిని చిరునవ్వుతో స్పృశించాడు. మరుక్షణమే పులి మాయమైపోయి, దాని చర్మం ఆ యువకుడి నడుము చుట్టూ వస్త్రంగా నిలిచింది. ఆ దృశ్యాన్ని చూసి మునులు ఆశ్చర్యం చెందారు.





అయినా మునులు తమ ప్రయత్నాన్ని విరమించుకోకుండా, ఒక పొట్టి దయ్యాన్ని సృష్టించి, ఆ యువభిక్షువు మీదికి పంపారు. పొట్టి దయ్యం భయానకంగా బొబ్బలు పెడుతూ, యువకుణ్ణి సమీపించింది. కాని మరుక్షణంలోనే అది అతని కాళ్ళకిందికి చేరింది.

ఆ దృశ్యాన్ని చూసిన తరవాత, మునులకు శాన్త జ్ఞానోదయం అయింది. ఆ యువభిక్షువు సామాన్యుడు కాదనీ, ఏ దేవుడో ఇలా మారువేషంలో వచ్చి ఉంటాడనీ ఊహించగలిగారు. మునులందరూ, మెల్లగా అతణ్ణి సమీపించి, చేతులు జోడించి, "మీరెవరు ?" అని అడిగారు వినయంగా.





అప్పుడు ఆ యువభిక్షువు, తన నిజ స్వరూపంతో మునులకు దర్శన మిచ్చాడు. పరమశివుడే, తన భక్తులైన మునుల అహంకారాన్ని పోగొట్టడానికి ఇలా నాటకమాడాడు. తమ పత్నులు సైతం తమ గొప్పను గుర్తించకపోయే వరికి, మునుల అహంకారం పూర్తిగా నశించిపోయింది. మునులందరూ శివుని పాదాలకు నమస్కరించారు.

మునులందరూ శివుని ఎదుట కూర్చుని, శివలీలలను కీర్తిస్తూ గానం చేయసాగారు. ఆ గానానికి పరవశం చెందిన శివుడు నాట్యం చేయసాగాడు. శివుడి నాట్యాన్ని చూసి మునులు పరమానందం చెందారు. కొంతసేపటికి శివుడు అదృశ్యమయ్యాడు.





శివుడు చేసిన ఈ అద్భుత నాట్యం గురించి విన్న ఆదిశేషుడు, పరమేశ్వరుణ్ణి దర్శించి, ఆ నాట్యాన్ని చూడాలన్న కుతూహలం తనకూ ఉన్నదనీ, తన కోరిక తీర్చమనీ ప్రార్థించాడు. అయితే, ఎవరైనాసరే శివుడి నాట్యం చూసి ఆనందించాలంటే, మానవజన్మ ఎత్తాలి!

ఆదిశేషుడు పతంజలిగా జన్మించి, శివుడి నటరాజ విగ్రహాన్ని దర్శించాడు. నటరాజ విగ్రహం పాదం కింద అహంకారమనే రాక్షసుడు ఉన్నాడు. ఒక చేతిలో ఢమరువు—అది జీవననంగీతానికి సంకేతం. మరొక చేతిలో అగ్ని; అది శక్తిస్వరూపం. మూడవది భక్తుల పాలిటి అభయహస్తం పైకెత్తబడి ఉన్నది. నాలుగవ హస్తం శరణన్న వారిని కాపాడడానికి సిద్ధంగా ఉన్నది.






శివుడు నాట్యం చేసిన స్థలం, చిదంబరం అనే శివక్షేత్రంగా, అతి ప్రాచీన కాలం నుంచి ప్రసిద్ధిగాంచింది. ముప్పై రెండు ఎకరాల విస్తీర్ణంతో ప్రస్తుతం అక్కడ వెలసిఉన్న బ్రహ్మాండమైన దేవాలయం రెండువేల సంవత్సరాల చరిత్ర గలిగినది. ఈ ఆలయంలోని అద్భుత శిల్పాలు, చూసేవారికి ఆనందాశ్చర్యాలు కలిగిస్తాయి.



# తప్పించుకుపోయిన దొంగ

వెయ్యి సంవత్సరాల క్రితం హొంగీ చౌ నగరంలో ఒక ప్రసిద్ధుడైన గజదొంగ ఉండేవాడు. వాడి అసలు పేరేమిటో, మనిషి ఎలా ఉంటాడో ఎవరికీ తెలియదు. వాడు ఎన్ని ఇళ్ళల్లోనో జొరబడి ఎన్నో దొంగతనాలు చేసినప్పటికీ, వాణ్ణి కళ్ళతో చూసినవారు లేరు. అయితే వాడు దొంగ తనం చేసినప్పుడల్లా ఇంటి లోపలి గోడ మీద ''ఇదుగో వచ్చాను'' అని రాస్తూ ఉండేవాడు.

ఈ కారణం చేత అందరూ వాణ్ణి ''ఇదుగో వచ్చాను'' అనేవాళ్ళు.

రానురాను ''ఇదుగో వచ్చాను'' దొంగ తనాలు దుర్భరమైపోయాయి. ఈ గజ దొంగ బారి నుంచి తమను కాపాడ వలసిందిగా వారు ప్రభుత్వానికి మొర పెట్టుకున్నారు. ''ఇదుగో వచ్చాను'' అన్న దొంగకోసం నగరమంతా గాలించి పట్టుకో వలసిందని నగరపు న్యాయాధికారి రక్షక భటులను ఆజ్ఞాపించాడు. ఈ దొంగను పట్టుకోవటానికి ఆయన ఒక గడువు కూడా ఏర్పరిచాడు.

రక్షకభటులు పెద్ద చిక్కులో పడ్డారు. దొంగ చూడబోతే దేవాంతకుడు. వాడు ఎవడో, ఎలా ఉంటాడో, ఎక్కడ ఉంటాడో చెప్పగలవాడు ఒక్కడూ లేడు. అటు వంటివాణ్ణి ఇన్ని రోజులలోగా పట్టుకోవాలి అంటే అది సులువైన పని కాదు. అయి నప్పటికీ దీక్షతో పని చేస్తే సాధించరాని దంటూ ఉండదు గనక, రక్షకభటులు ఒక మనిషిని పట్టి న్యాయాధికారి వద్దకు తెచ్చి, ''అయ్యా, వీడే 'ఇదుగో వచ్చాను.' వీడికి శిక్ష విధించి నగరానికి పీడ విరగడ చెయ్యండి!'' అని చెప్పారు.

''గజదొంగ వీడేననటానికి సాక్ష్యం ఏమిటి?'' అని న్యాయాధికారి అడిగాడు.

చీనా జానపద కథ



మా తల ప్రాణాలు తోకకు వచ్చాయి. ఇప్పుడు విడిచిపుచ్చారో వీడు మరి దొరకడు!" అని గట్టిగా చెప్పాడు.

కొత్వాలు అంత గట్టిగా చెప్పిన మీదట న్యాయాధికారి, "సరే ప్రస్తుతానికి ఖైదులో ఉంచండి. విచారణలో నిజం తేలుతుంది!" అన్నాడు.

పట్టుబడినవాడు నిజంగా గజదొంగే. వాడు ఖైదులో అడుగు పెడుతూనే జైలు అధికారితో ఎంతో వినయంగా, "అయ్యా, కొత్త ఖైదీలు ఉత్త చేతులతో తమవద్దకు రావటం ఆచారం కాదు. కాని ఏం చెయ్యను. రక్షకభటులు నన్ను పట్టుకున్నప్పుడు నా దగ్గిర ఉన్నదంతా ఊడగొట్టి లాగేసుకున్నారు. తమకు అభ్యంతరం లేకపోతే, కొండదేవర గుడికి వెళ్ళి, అక్కడ పగిలిన ఇటుక రాయికింద నేను దాచుకున్న వెండి తెచ్చుకోండి," అన్నాడు.

జైలు అధికారి ఈ మాటలు నమ్మలేదు. కాని తీరా వెళ్ళి చూస్తే, ఖైదీ చెప్పిన చోట శేరు వెండి దొరికింది.

అది మొదలు జైలు అధికారి, ఖైదీని చక్కగా చూస్తూ వాడితో చాలా సఖ్యంగా ఉండసాగాడు.

కొద్ది రోజులు పోనిచ్చి ఖైదీ జైలు అధికారితో, "వంతెనకింద కూడా కొద్ది

"మేము బహు శ్రద్ధగా ఆచూకీ చేసి, ఎంతో శ్రమపడి వీణ్ణి పట్టుకున్నాము. మీరు మా మాటయందు విశ్వాసం ఉంచవచ్చును!" అన్నారు రక్షకభటులు ఏక కంఠంగా.

"మహాప్రభూ, వీళ్ళు తమ బాధ్యత వదిలించుకోవటానికిగాను ఎవరినో ఒకరిని పట్టుకుందామనుకున్నారు. నా కర్మకొద్దీ నేను వీళ్ళకు దొరికాను!" అన్నాడు పట్టుబడినవాడు.

న్యాయాధికారి అనుమానంలో పడటం చూసి రక్షకభటుల నాయకుడైన కొత్వాలు, "వీడి మాటలు నమ్మి వీణ్ణి విడిచిపుచ్చేరు! వీడే అసలు దొంగ. వీణ్ణి పట్టుకునేసరికి



మొత్తం దాచుకున్నాను. అది కూడా తెచ్చేసుకోరాదా ?'' అన్నాడు.

''వంతెన మీద ఎప్పుడూ జనం తిరుగుతూంటారే!'' అన్నాడు జైలు అధికారి.

''నదిలో బట్టలు ఉతకటానికి వెళ్ళినట్టుగా గంప తీసుకుపొండి. డబ్బు తీసి గంపలో పెట్టుకుని, దానిపైన గుడ్డలు కప్పేస్తే నరమానవుడికి తెలియదు!'' అన్నాడు ఖైదీ.

అధికారి అ ప్రకారమే చేసి వీసెడు వెండి తెచ్చుకున్నాడు. అ తరవాత ఇద్దరికీ మధ్య ప్రాణస్నేహం ఏర్పడింది. ఆ రాత్రి జైలు అధికారి ఖైదీతో కలిసి తాగటానికి సారా కూడా పట్టుకువచ్చాడు.

''చూడు, అన్నా! ఈ రాత్రి నేను ఇంటికి వెళ్ళి వస్తాను. తెల్లారేసరికల్లా తిరిగి వస్తాను, నీ పైన ఒట్టు! పారిపోతానని భయపడకు. పారిపోతే నా నేరం నేనే ఒప్పుకున్నట్టు కాదా? పైగా పారిపోవటం అర్థం లేని పని. ఇవాళ కాకపోతే రేపైనా న్యాయాధికారి గారు నన్ను వదిలిపెట్టాల్సిందే. నేను దోషిని కానుగద!'' అన్నాడు ఖైదీ నమ్మకంగా.

ఖైదీని పోనివ్వటం తనకు ప్రమాదమేనని తెలిసి కూడా, కాదు కూడదనటానికి అధికారి మొహమాటపడి సరేనన్నాడు. ఖైదీ బయటికి వెళ్ళటానికి జైలు ద్వారం తలుపులు ఉపయోగించక కప్పు మీదికి ఎక్కి వెళ్ళిపోయాడు.

మళ్ళీ తెల్లవారుజామున కప్పు మీది నుంచే మెల్లగా దిగి వచ్చి, ఇంకా నిద్ర లేవని జైలు అధికారిని లేవగొడుతూ, ''ఇదుగో వచ్చాను! ఇదుగో వచ్చాను!'' అన్నాడు.

''మొత్తం మీద అన్న మాట నిలబెట్టుకున్నావే! భలే మంచివాడివి,'' అన్నాడు అధికారి సంతోషిస్తూ.

''అమ్మమ్మా! లేకపోతే నీ పరువు పోదా, అన్నా? నువు నాకు చేసిన ఈ మేలు ఎన్నటికీ మరవను. నా కృతజ్ఞత చూపటానికి ఉడతా భక్తిగా మీ ఇంట

చిన్న కానుక పడేసి వచ్చాను. ఇప్పుడే వెళ్ళి చూసుకో. నేనిక్కడ ఎంతోకాలం ఉండబోనులే!'' అన్నాడు ఖైదీ. జైలు అధికారి ఇంటికి వెళ్ళాడు.

''మీకోసం కబురు పెడదామను కుంటుండగా మీరే వచ్చారు. తెల్లారు జామున ఎంత చిత్రం జరిగిందను కున్నారు ? ఇంటి కప్పు మీద ఏదో చప్పు డయింది. ఇంతలోనే • ఈ పొట్లం గదిలో పడింది. తెరిచి చూద్దునుగదా వెండి పళ్ళాలూ, బంగారు పళ్ళాలూ ఉన్నాయి!'' అన్నది జైలు అధికారి భార్య.

తన ఖైదీ ఇచ్చిన కానుక ఇదేనని అధికారికి అర్థమయింది. ''పైకి అనకే, నీకు పుణ్యం ఉంటుంది! వాటిని భద్రంగా దాయి! తరవాత మెల్లిమెల్లిగా అమ్మి సొమ్ము చేసుకుందాం!'' అన్నాడాయన భార్యతో.

ఆ రోజు న్యాయస్థానానికి వచ్చినవారిలో ఆరేడుగురు గృహస్థులు, తమ ఇంట కిందటి రాత్రి ''ఇదుగో వచ్చాను'' జొర బడి, దొంగతనాలు చేసి, గోడల మీద తన పేరు రాసి వెళ్ళినట్టు ఫిర్యాదులు తెచ్చారు. ఈ గజదొంగను వెంటనే పట్టుకోమని కూడా వారు న్యాయాధికారిని వేడుకున్నారు.

''నేను అప్పుడే అనుకున్నాను! రక్షక భటులు పట్టుకున్నది మరొకణ్ణి—అసలు దొంగ తిరుగుతూనే ఉన్నాడు!'' అనుకున్నాడు న్యాయాధికారి. ఒక నిర్దోషికి అన్యాయం జరిగిందని తోచి ఆయన, ఖైదీని వెంటనే విడుదల చెయ్యవలసిందిగా జైలు అధికారికి ఆజ్ఞాపత్రం పంపుతూ, ఫలాని గడువులోగా ''ఇదుగో వచ్చాను'' అనే గజదొంగను పట్టుకోవలసిందిగా రక్షకభటులను తిరిగి ఆజ్ఞాపించాడు.

గజదొంగ ఖైదులో పడి కూడా తప్పించుకు పారిపోయాడు. ఆ పోయినవాడే గజదొంగ అన్న విషయం ఒక్క జైలు అధికారికి మాత్రమే అర్థమయింది; కాని ఆయన దొంగసొత్తు తిని ఉండటంచేత కుక్కిన పేనులాగా ఉండిపోయాడు.





# శివలీలలు

తల్లి మాటలు విని సిద్ధరాముడు పొంగిపోయి, ''అయితే వచ్చే దీపావళికి వాళ్లను తీసుకొద్దా మమ్మా. అందరి అక్కలూ, బావలూ పండగకు వస్తున్నారు. మనం నా అక్కనూ, బావనూ ఎప్పుడూ తీసుకు రాలేదు,'' అన్నాడు.

''నాయనా, మీ తండ్రి పోయాక వాళ్లను ఎవరు పిలుచుకు వస్తారు? నువ్వేమో పసివాడివి. దారి అంతా అరణ్యం. అందులో సింహాలూ, పెద్దపులులూ, ఎలుగుబంట్లూ, నాగుపాములూనూ; కాక పోయినా మీ బావ వంటి ఐశ్వర్యవంతుడు మన పేద ఇంటికి ఎందుకు వస్తాడు? అయన ఒంటరిగా రాడాయె; పెద్ద పరివారంతో వస్తాడు. ఒక పూట తింటే ఇంకో పూట తినలేని మనం వారి కందరికీ ఎలా తిండి పెట్టగలం? నువు పెద్దవాడివై, సంపాదించేటప్పుడు మీ అక్కనూ, బావనూ తీసుకొద్దువుగాని!'' అన్నది తల్లి రాముడితో.

రాముడు అప్పటి కేమీ అనక, మర్నాడు తూర్పు తెల్లవారక ముందే లేచి, తల్లికి చెప్పకుండా ఇంటి నుంచి బయలుదేరి, కనిపించిన వారి నందరినీ శ్రీశైలానికి దారి అడుగుతూ, క్రూరమృగాలను లక్ష్య పెట్టక అరణ్యాల గుండా నడిచి చివరకు శ్రీశైలం చేరాడు. అక్కడ ఎన్నో తీర్థాలూ, ఆలయాలూ ఉన్నాయి. రాముడు తన అక్క, బావల కోసం అంతటా చెడతిరిగాడు. ''మల్లికార్జునుడు ఎక్కడ

2. సిద్ధరాముడి భక్తి



ఎంత ధనికుడవైతే మాత్రం బంధుత్వం పోతుందా ? మేము పేదవాళ్ళ మనుకోక మా ఇంటికి రా. నిన్ను తీసుకుపోకుండా నేను తిరిగిపోను,'' అన్నాడు.

రాముడి వేడుకోలు అరణ్యరోదన మయింది. వాడు తన అక్కను కూడా ఇదే విధంగా బతిమాలుకున్నాడు, కాని లాభం లేకపోయింది.

భరించరాని నిరాశతో రాముడు ఆత్మ హత్య చేసుకోవటానికి నిశ్చయించు కున్నాడు. అక్కనూ, బావనూ తీసుకు వస్తావని ప్రగల్భాలు పలికి తీసుకు రాలేక పోతే తోటివాళ్ళ దగ్గిర ఎంత అవమానం! ఆ అవమానం భరించే కన్న చావటం మేలు. ఆ చచ్చేది అక్కా బావలున్న చోటే చస్తే ఆ మాట వారికే వస్తుంది.

ఇలా అనుకుని రాముడు కొండ శిఖరం ఎక్కి, అక్కడి నుంచి కిందికి దూక బోయాడు.

అంతలోనే అతని భుజాలు ఎవరో పట్టుకున్నారు. ఒక పక్క మగవాడూ, ఒక పక్క ఆడదీ ఉన్నారు.

''ఎవరు మీరు ? చచ్చిపోదామనుకున్న నన్ను మీరు ఎందుకు ఆపుతున్నారు ? నా అక్కకూ, నా బావకూ లేని జాలి నా మీద మీ కెందుకు ?'' అని అడిగాడు రాముడు.

ఉంటాడు ?'' అని ఎవరినో అడిగితే, వాళ్ళు రాముడికి దేవాలయం చూపారు. అందులోకి వెళ్ళి చూస్తే లింగం తప్ప ఏమీ లేదు.

అప్పటికే రాముడు చాలా అలిసిపోయి ఉన్నాడు. వాడు ఆ లింగానికి ఎదురుగా కూర్చుని, ''బావా, నిన్నూ అక్కనూ దీపావళికి తీసుకుపోదామని, ఎవరితోనూ చెప్పకుండా బయలుదేరి వచ్చాను. మా ఊళ్ళో అందరి అక్కలూ, బావలూ పండగకు వస్తున్నారు. మా అమ్మ మీ ఇద్దరినీ చూడటానికి వెయ్యి కళ్లతో ఎదురు చూస్తున్నది. ఇన్నాళ్ళూ పిలవలేదని అలిగి, కనబడకుండా ఉన్నావా ? నువు



తన మాటలు నిజమని నమ్మి, కుర్రవాడు శ్రీశైలం పోయి ఉంటాడనుకుని ఆమె అమితంగా భయపడింది.

కొద్ది రోజులు గడిచాయి. పండగ వచ్చింది. దానితోపాటే ఉదయం పూట రాముడు ఇంటికి తిరిగి వచ్చి, అక్కనూ, బావనూ వారి పరివారాన్నీ తీసుకు వచ్చానని, వారంతా ఆలయం వద్ద ఉన్నారనీ చెప్పాడు. రాముడి తల్లి ఆనందాశ్చర్యాలతో ఆలయానికి వెళ్ళి, పార్వతీ పరమేశ్వరులనూ, వినాయకుణ్ణీ, కుమారస్వామినీ, వారి పరివారాన్నీ కళ్ళారా సందర్శించి, అందరినీ తమ ఇంటికి ఆహ్వానించింది.

అప్పుడు ఆ స్త్రీ, "మేం పరాయివాళ్ళం కాదు, తమ్ముడూ! నేను నీ అక్కను, భ్రమరాంబను. ఈయన మీ బావగారు. మమ్మల్ని ఎప్పుడూ చూసి ఎరగవు. సోమయాజులుగారి అబ్బాయి ఇక్కడ తిరుగుతున్నాడంటే నిన్ను వెతుక్కుంటూ వస్తున్నాం," అన్నది.

రాముడు పరమానందభరితుడై అక్కకూ, బావకూ మొక్కాడు. వాళ్ళు రాముడికి తమ కొడుకులనూ, పరివారాన్నీ చూపించారు, రాముడు వారిని తన వెంట రమ్మన్నాడు.

ఈ లోపల రాముడి తల్లి కొడుకును కానక, ఏమైనాడోనని తల్లడిల్లి పోయింది.

వారంతా వచ్చేసరికి వారి పాత ఇంటికి మారుగా ఒక దివ్యభవనం ఉన్నది. అతిథులు అందులో ప్రవేశించారు. ఆ రోజు ఊళ్ళోవాళ్ళు, కొత్తగా వెలిసిన ఆ ఇంటిని చూసి ఆశ్చర్యపోయారు. బయటి ద్వారాలు మూసి ఉన్నాయి. లోపల అంతులేని జనం ఉన్నట్టు సందడిగా ఉన్నది.

దీపావళికి రాముడి అతిథులుగా వచ్చిన పార్వతీ పరమేశ్వరులు, రాముణ్ణీ, అతని తల్లినీ తమ వెంట కైలాసానికి తీసుకువెళ్ళారు.

గయాసురుడనే దానవుడు ముల్లోకాలు ఆక్రమించి కైలాసం మీదకు కూడా విరు

చుకుపడ్డాడు. శివుడు తన జటాజూటాన్ని విదిలించగా అందుండి భయంకరమైన ముఖంతో, పెద్ద శరీరంతో ఒక ఘోరాకారుడు దానవుణ్ణి కబళించటానికి ఉరికాడు. గయాసురుడు భయంతో గజగజ వణికిపోతూ శివుణ్ణి శరణు వేడుకొన్నాడు. శివుడు అభయమిచ్చాడు.



భయంకర ముఖుడు చేసేది లేక "ఆహారం! ఆహారం కావాలి!" అని ఆక్రోశించాడు.

"నీ శరీరాన్నే నీవు తిని నీ ఆకలి చల్లార్చుకోవలసిందే!" అన్నాడు.

శివాజ్ఞను శిరసావహించి భయంకర ముఖుడు తన శరీరాన్నంతటినీ భక్షించి ముఖంతో మిగిలాడు. అప్పుడు శివుడు ప్రీతుడై ఆ ముఖానికి "కీర్తిముఖము" అని పేరు పెట్టాడు. "ఓయీ, కీర్తి ముఖుడా! నీవు అందరి దేవతల తలలపై నిలిచి వారికి కీర్తి కలుగజేస్తుంటాంవు" అని వరమిచ్చాడు.

ఆ విధంగా శివుని అంశ కీర్తిముఖంగా మకరతోరణం మధ్య, ప్రతి దేవతామూర్తి నడినెత్తిన ప్రకాశించింది.

బదరికాశ్రమంలో దుర్వాసుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఒక నాడు ఆయన దేవతార్చనచేసి, హవిశ్శేషాలను లేడిపిల్లలకు తినిపిస్తూండగా, తుంబురు డనే ప్రమధుడు ఆకాశమార్గాన తన భార్యతో సహా పోతూ చూసి, లేడి పిల్లలకేసి చిటికెలు వేశాడు. అవి బెదిరి పారిపోయాయి. అసలే కోపిష్ఠి అయిన దుర్వాసుడు తుంబురుణ్ణి మనిషి జన్మ ఎత్తమని శపించాడు.

తుంబురుడు భయపడి విమానం దిగి, "స్వామీ, మీ జింక పిల్లలను చూసి ముచ్చటపడి చిటిక వేస్తే అది నాకు శాపమై చుట్టుకున్నది. మీ శాపం అమోఘం గనక అలాగే మనిషి జన్మ ఎత్తుతాను. కాని ఆ జన్మలో శివభక్తి ఉండేటట్టు అనుగ్రహించండి," అన్నాడు. దుర్వాసుడు అలాగే అనుగ్రహించాడు.

దుర్వాసుడి శాపం ఫలితంగా తుంబురుడు కాంచీపురంలో వైశ్యుల ఇంట చిరుతొండడు అనే పేరుతో పుట్టాడు. అతని భార్య కూడా తిరువెంగనాంచి అనే పేరుతో పుట్టి, చిరుతొండడికి భార్య అయింది. వారికి సిరియాలుడు అనే కొడుకు కలిగాడు.

చిరుతొండడు వీరశైవాచార పరాయణుడై, ఏకామ్రనాథుణ్ణి అర్చించుతూ, శివభక్తులు ఏవేళ ఏపదార్థం కోరినా శక్తి వంచన లేకుండా ఇస్తూండేవాడు.

ఒకనాడు అతని ఇంటికి ఒక శివభక్తుడు వచ్చి, చిరుతొండడిని ఆశీర్వదించి, అతని నుంచి అర్చనలు పొంది, "నాయనా, నిత్యమూ శివుణ్ణి చెరుకు రసంతో అభిషేకించటం నా వ్రతం. అందుచేత చేతితో గానుగ ఆడిన చెరుకు రసం నాకు తూమెడు కావాలి," అన్నాడు.

చిరుతొండడు పరమానందం చెంది, డబ్బు తీసుకుని చెరుకు గడలు కొనటానికి బయలుదేరి వెళ్ళాడు.

తూమెడు రసం కోసం నూరు చెరుకు గడలు కావాలి. అందుచేత చిరుతొండడు నూరు చెరుకు గడలు కొని కట్ట కట్టించాడు. కాని అంత పెద్ద మోపు ఎత్తటం అతనికి సాధ్యం కాలేదు. అప్పుడు శివుడే మనిషి రూపంతో వచ్చి ఆ మోపును తాను కూడా మోసుకొచ్చి అంతలోనే మాయమయాడు.

చిరుతొండడు అది చూసి ఆశ్చర్యపడి, తన చేత్తోనే చెరుకుగడలను గానుగ ఆడి, తూమెడు రసం తీసి, అతిథికి ఇచ్చాడు. శివుడికి అభిషేకం జరిగిపోయింది.

కైలాసం మీద పార్వతి శివుడి శరీరమంతా చెమటతో తడిసి ఉండటం చూసి కారణం అడిగింది. శివుడు ఆమెకు చిరుతొండడి సంగతి చెప్పి, "నా భక్తుడు చెరుకుగడల మోపు ఎత్తలేక పోయేసరికి నేను సహాయం చేశాను. అతనికి చెమట పట్టింది. నాకూ పట్టింది," అన్నాడు. ఆ భక్తుణ్ణి తాను కూడా చూడాలని పార్వతి కోరింది.






# ఉన్నత న్యాయస్థానం

చంపక దేశానికి లీలాధరుడు రాజు. ఆయన భార్య పేరు నందిని. రాజుకు ఆమెపట్ల వల్లమాలిన ప్రేమ. ఎట్టి పరిస్థితులలోనూ, ఆమె మనసుకు కష్టం కలగకుండా వ్యవహరిస్తూండేవాడు.

నందిని తమ్ముడు నాగసేనుడనేవాడు, అక్కగారి అలుసు చూసుకుని రాజ్య పాలనలో ఇష్టం వచ్చినట్టు జోక్యం కలిగించుకునేవాడు. అతడు విలాస జీవితానికి బాగా అలవాటుపడిపోయాడు. అందుకుగాను రైతులనుంచీ, వర్తకుల నుంచీ అన్యాయంగా డబ్బు గుంజుతూ, ఎవరైనా ఎదిరిస్తే, అదంతా రాజుగారి అనుమతితోనే జరుగు తున్నదని బెది రించేవాడు.

అతడి అక్రమాలు ప్రజలూ, రాజోద్యో గులూ ఎన్నోసార్లు రాజు దృష్టికి తెచ్చారు. అయినా రాజు, తన బావమరిదిని మంద లించినా, ఏదైనా చర్య తీసుకున్నా, రాణీ మనసు నొచ్చుతుందని, ఏమీ పట్టించు కునేవాడు కాదు.

ఒకనాడు జయమల్లు అనే యువకుడు, తన దగ్గిరవున్న రెండు గుర్రాలను విక్ర యించడానికి రాజధానికి వచ్చాడు. సంత వీధిన పోతున్న నాగసేనుడు ఆ గుర్రా లను చూసి, జయమల్లు దగ్గిరకు వచ్చాడు.

అతడు గుర్రాలను కొనడానికి వచ్చిన వాడనుకుని, జయమల్లు వాటి ధర చెప్పబోతున్నంతలో, నాగసేనుడు అతణ్ణి వారించి, "వీటికి పన్నుగా పాతిక వెండి నాణాలు చెల్లించవలసి వుంటుంది. అలా కాని పక్షంలో ఒక గుర్రాన్ని వదులుకో," అన్నాడు గద్దిస్తూ.

జయమల్లు ఆశ్చర్యపోతూ, "అసలు గుర్రాల అమ్మకమే జరగలేదు; ఇంతలో

కమలిని

నేను పన్ను చెల్లించడమేమిటి?" అని అడిగాడు.

ఆ జవాబుకు నాగసేనుడు రెచ్చిపోయి, "ఒరే, నేనెవరనుకుంటున్నావు? నాకే ఎదురుపలకడమా?" అని, జయమల్లును దుర్భాషలాడుతూ, చెంపమీద గట్టిగా కొట్టాడు.

దానితో జయమల్లు కోపం తెచ్చుకుని కత్తి దూశాడు. నాగసేనుడు కూడా కత్తి దూసి, అతడిమీద తిరగబడ్డాడు. ఇద్దరికీ కొద్దిసేపు కత్తియుద్ధం జరిగాక, నాగసేనుడు కొద్దిగా గాయపడి అక్కడినుంచి పారిపోయాడు.

తర్వాత అతడు రాజు లీలాధరుడి వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో మంత్రి మకరందుడూ, రాణి నందినీ అక్కడే వున్నారు.

నాగసేనుడు, రాజుతో, "గుర్రాల వ్యాపారం చేసే, ఒక పల్లెటూరి పొగరుబోతు నన్ను గాయపరిచాడు. సంత వీధిలో వున్న వాణ్ణి వెంటనే బంధించి, కఠినంగా శిక్షించండి," అని చెప్పాడు.

రాజు భటులను పిలవబోయేంతలో, మంత్రి, "ప్రభూ, కఠినంగా శిక్షించడం మాట తరవాత. ముందు ఆ వ్యాపారితో పాటు, అక్కడ వున్న సాక్షులను కూడా పిలిపిద్దాం. అప్పుడు న్యాయాన్యాయాల విచారణ సులభమవుతుంది," అన్నాడు.

రాణి నందిని కలగజేసుకొని, "రాజ బంధువుమీద తిరగబడడంకన్నా, మరొక



నేరం ఏముంటుంది? వెంటనే వాణ్ణి పట్టి బంధించి ఉరితీయించండి!'' అని తన అజ్ఞగా చెప్పి, అక్కడినుంచి వెళ్ళి పోయింది.

రాజభటులు నగరంలోకిపోయి, జయమల్లును పట్టుకుని, రాజువద్దకు తీసుకువచ్చారు. జయమల్లు తాను ఎట్టి పరిస్థితుల్లో, నాగసేనుడిపై కత్తి దూయ వలసి వచ్చిందో రాజుకు విన్నవించు కున్నాడు. రాజుకు అతడు చెప్పింది నిజమే అనిపించినా, రాణికి కోపం వస్తుందని, అతడికి అప్పటికప్పుడే ఉరి శిక్ష విధించాడు. భటులు జయమల్లును కారాగారానికి తీసుకుపోయారు. ఉరిశిక్ష మర్నాడు అమలుజరగవలసి వున్నది.

తను ఒక నిరపరాధికి శిక్ష విధించానన్న బాధ రాజును కలవరపరచసాగింది. తెల్ల వారితే జయమల్లు ఉరితీయబడతాడు. ఆ రాత్రి ఎంత ప్రయత్నించినా రాజుకు నిద్ర పట్టలేదు.

ఆయన అప్పటికప్పుడే మంత్రిని పిలిపించి, ''మహారాణిని నొప్పించ కుండా, జయమల్లు ఉరిశిక్షను రద్దు చేసేందుకు ఉపాయం ఏదైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.

మంత్రి కొంచెంసేపు ఆలోచించి, ''ప్రభూ, ఇందుకు ఒక మార్గం వున్నది. ఆ జయమల్లు చేత రాణిగారికీ, నాగసేను డికీ క్షమాపణ చెప్పించి, ప్రాణ భిక్ష కోరేలా చేద్దాం. తరవాత అతడికి కొద్ది



కాలంపాటు కారాగార శిక్ష విధిస్తే సరిపో తుంది,'' అని సలహా ఇచ్చాడు.

రాజూ, మంత్రీ, జయమల్లు వున్న కారాగారానికి వెళ్ళారు. మంత్రి అతడితో, ''జరిగిందేదో జరిగింది. నీకు ఉరిశిక్ష తప్పాలంటే, మహారాణినీ, నాగసేనుణ్ణీ ప్రాణ భిక్ష కోరి, క్షమాపణ చెప్పుకో,'' అన్నాడు.

అందుకు జయమల్లు చిరునవ్వు నవ్వి, ''కొద్ది గంటల్లో నేను, రాజుగారి తీర్పు మీద ఉన్నత న్యాయస్థానంలో ఫిర్యాదు చేయబోతున్నాను. మన్నించండి, నాకు ఎవరినుంచీ క్షమాభిక్షలు అవసరంలేదు,'' అన్నాడు.

ఇది విన్న రాజు కోపంగా, ''ఈ రాజ్యంలో రాజును మించిన మరొక ఉన్నతన్యాయస్థానం వున్నదా? నీకు మరణశిక్ష విధించిన నేను, జాలిపడి ప్రాణాలు కాపాడవస్తే—ఏదో ఉన్నత న్యాయస్థానమంటూ వదరుబోతులా వాగు తున్నావు,'' అన్నాడు.

జయమల్లు ఏమీ తొట్రుపడకుండా, ''రాజు భూమి మీద భగవంతుడి ప్రతినిధి లాటివాడని అంటారు. వ్యక్తిగతమైన ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా, న్యాయం జరిగేలా చూడడం అతడి బాధ్యత. అలా జరగనిపక్షంలో, అతడి తీర్పును పునఃపరిశీలించి తగిన న్యాయం జరిపించమని, ఎవరైనా అర్థించగలిగేది, ఆ భగవంతుణ్ణే కదా! మీ తీర్పుపై, నేను ఫిర్యాదు చేయబోతున్నది, ఆ ఉన్నత న్యాయస్థానంలోనే. మీరు నిశ్చింతగా నన్ను ఉరి తీయించండి,'' అన్నాడు.

జయమల్లు మాటలతో రాజుకు జ్ఞానోదయమయింది. న్యాయపాలన ఎంతటి పవిత్రమైనదో ఆయన అవగాహన చేసుకున్నాడు.

రాజు లీలాధరుడు అప్పటికప్పుడే జయమల్లును విడుదల చేయించి, ఆనాటి నుంచీ ప్రజలందరికీ సక్రమంగా న్యాయం జరిగేట్టు చూస్తూ, అందరిచేతా ధర్మ ప్రభువుగా కీర్తించబడ్డాడు.





# శేషనాథుడి కృతజ్ఞత

వరాలయ్య నాగపట్నంలో వణిక్ప్రముఖుడు. ఆయన వద్ద కొకనాడు శేషనాథుడనే స్నేహితుడు వచ్చి, ''జీవితంలో ఎదురుదెబ్బలు చాలా తిన్నాను. ప్రస్తుతం, నా తల్లిదండ్రుల్నీ, భార్యా బిడ్డల్నీ పోషించుకోలేని స్థితి. మన చిన్ననాటి స్నేహాన్ని గుర్తుంచుకుని, నీ దగ్గిరకు వచ్చాను. నువ్వు, నాకు సాయపడాలి,'' అన్నాడు.

వరాలయ్యా, శేషనాథుడూ చిన్నతనంలో, ఒకే గ్రామంలో ఇరుగుపొరుగున వుండేవారు. శేషనాథుడు మితభాషి; మొహమాటస్థుడు. వరాలయ్య చురుకైనవాడు; అల్లరి బాగా చేసేవాడు. తను చేసిన చెడ్డపనులను అతడు, శేషనాథుడి మీదికి నెట్టేస్తూండే వాడు. అయితే, శేషనాథుడు, వరాలయ్య అబద్ధాలను బయట పెట్టక, మౌనంగా తన్నులూ, చీవాట్లూ తింటూండేవాడు.

క్రమంగా వరాలయ్య, శేషనాథుడి మంచితనాన్ని గ్రహించాడు. ఇద్దరూ మంచి స్నేహితులయ్యారు. తరవాత కొంత కాలానికి వరాలయ్య వ్యాపారం చేయడానికి పట్నం వెళ్ళి, బాగుపడ్డాడు. శేషనాథుడు పల్లెలోనే వుండిపోయాడు.

శేషనాథుడి మాటలు విని, వరాలయ్య ఎంతో నొచ్చుకుని, ''నీవంటి మిత్రుడికి సాయపడకపోతే, నా జీవితం, ఐశ్వర్యం వ్యర్థం. పల్లెలో నీకున్నదంతా తెగనమ్మి, ఇక్కడికి వచ్చెయ్యి. నీ డబ్బునే పెట్టుబడిగా తీసుకుని, నిన్ను నా వ్యాపారంలో భాగస్వామిని చేసుకుంటాను,'' అన్నాడు.

వరాలయ్య చెప్పినట్టే చేశాడు, శేషనాథుడు. వరాలయ్య అతడికి ఇల్లు కొని పెట్టాడు. అతడి అవసరాలన్నీ తనే తీర్చేవాడు. పైగా ప్రతి నెలా శేషనాథుడికి వెయ్యి వరహాలు వేతనంగా ఇచ్చేవాడు.

“వసుంధర”



సంగతేమంటే, శేషనాథుడికి ప్రపంచ జ్ఞానం ఎక్కువ. అతడి నుంచి మంచి సలహాలు లభిస్తవన్న పేరు, పట్నంలో వ్యాపించింది. శేషనాథుడి సలహాల కారణంగా ఎందరో తమ లోపాలను సరిదిద్దుకున్న విషయం, వరాలయ్య చెవినపడింది.

వరాలయ్య ఆశ్చర్యపడి, శేషనాథుడితో, ''నీలో ఇంత ప్రతిభ వున్నట్టు, నాకు తెలియదు. నువ్వేనాడూ, నాలోని లోపాల సంగతి చెప్పలేదు,'' అన్నాడు.

''నీలో లోపముంటే గదా చెప్పడానికి!" అన్నాడు శేషనాథుడు.

ఈ జవాబు విని, వరాలయ్య మహా గర్వపడ్డాడు.

ఇప్పుడు శేషనాథుడి జీవితం బాగుపడింది. అతడి ఇంట్లో వాళ్ళందరూ, వరాలయ్యను దైవసమానుడుగా భావించేవారు.

వరాలయ్య, శేషనాథుడితో, ''నువ్వు, నావద్ద ఉద్యోగం చేయడం లేదు. వ్యాపారంలో నాకు భాగస్వామివి. కేవలం అందులో నాకు సాయపడడమే కాక, నా పద్ధతుల్లో లోపాలుంటే కూడా చెబుతూండు,'' అన్నాడు.

అయితే, శేషనాథుడు తన పరిమితులు తెలుసుకుని, వరాలయ్య దగ్గిర అణకువగా వుంటూ, అతడి పద్ధతుల్ని మెచ్చుకునేవాడు. ఒక్కసారి కూడా అతడు, వరాలయ్య లోపాలను గురించి చెప్పలేదు.

ఇలా వుండగా, వరాలయ్య కొడుకు ఒక పేద ఇంటి పిల్లను పెళ్ళాడ దలిచాడు. వరాలయ్య, ఆ పిల్లను కోడలుగా చేసుకునేందుకు అంగీకరించలేదు. కోపంతో కొడుకు ఇల్లు వదిలి పోతానన్నాడు.

''పోతే పొమ్మంటాను. పేదరికమంటే ఏమిటో, వాడికే తెలిసివస్తుంది,'' అని వరాలయ్య, శేషనాథుడితో అంటే, అతడు సరేనన్నట్టు తల వూపి వూరుకున్నాడు.

అదే సమయంలో వరాలయ్య తోటి వ్యాపారి ధనగుప్తుడికి అలాంటి సమస్యే ఎదురయ్యింది. అయితే, ఆయన పేద ఇంటి పిల్లను కోడలుగా తెచ్చుకున్నాడు.

వరాలయ్య ఇందులోని బాగోగులు తెలుసుకునేందుకు ధనగుప్తుడి ఇంటికి వెళ్ళాడు.

ధనగుప్తుడు అతడితో, "ఒకసారి విరిగిన మనసులు అతుక్కోవడం కష్టం. నువ్వీ పెళ్ళికి ఒప్పుకుంటే—నీ కొడుకూ, కోడలూ కూడా, కృతజ్ఞతతో జీవితాంతం, నిన్ను సేవించుకుంటారు. కొడుకును ఇంట్లోంచి వెళ్ళగొడితే, నీ భార్య దుఃఖిస్తుంది. ఇంట్లో సుఖశాంతులుండవు. డబ్బుండీ, సుఖశాంతులు లేని జీవితం వల్ల ప్రయోజనం ఏం వుంది?" అన్నాడు.



ఆ మాటలకు చాలా సంతోషించిన వరాలయ్య, "నువ్వు చాలా తెలివైనవాడివి. ఇంత మంచి ఆలోచన నాకు తట్టనేలేదు. అందరికీ మంచి సలహాలిస్తాడని పేరు పడ్డ శేషనాథుడికీ, ఈ ఊహ స్ఫురించలేదు," అని ధనగుప్తుణ్ణి మెచ్చుకున్నాడు.

ధనగుప్తుడు ఆశ్చర్యంగా, "అదేమిటి? ఈ ఆలోచన, నా బుద్ధికి పుట్టిందికాదు. నీ స్నేహితుడు శేషనాథుడే నాకీ సలహాయిచ్చాడు," అన్నాడు.

అది విని వరాలయ్య నివ్వెరపోయాడు. అతడు అక్కణ్ణించి బయలుదేరాడు. ఇంటికి వెళ్ళాక శేషనాథుణ్ణి, ఈ విషయమై గట్టిగా ప్రశ్నించాలనుకున్నాడు. అయితే, వెంటనే అతడికి ఒక అనుమానం వచ్చింది. శేషనాథుడు చితికిపోయి, తన దగ్గరకు వచ్చాడు. అతడికి తనంటే, అసూయగా వున్నదేమో! తను సుఖశాంతులతో బతకడం, అతడికి ఇష్టం లేకపోవచ్చు.

ఈ అనుమానం వచ్చాక వరాలయ్య, శేషనాథుణ్ణి మరింత శ్రద్ధగా గమనించసాగాడు. అందరికీ మంచి సలహాలిచ్చే శేషనాథుడు, తనకు చిన్న, చిన్న విషయాల్లో కూడా సలహాలివ్వడం లేదని తెలుసుకున్నాక, అతడి మనసు వికలమైపోయింది. తనవల్ల సాయం పొందిన శేషనాథుడు, తనకు సాయపడడం లేదనీ—ఇక ఈ ప్రపంచంలో ఎవ్వరికీ సాయపడకూడదనీ అతడు నిశ్చయించుకున్నాడు.

అయితే, ఆ మర్నాడే సదానందు డనే ఆయన, వరాలయ్యను చూడవచ్చాడు. ఈ సదానందుడు, వరాలయ్య కుల గురువు. ప్రతి సంవత్సరం, ఏదో సమయంలో వచ్చి, వరాలయ్య కుటుంబ పరిస్థితి విచారించి వెళుతూంటాడు.

వరాలయ్య ఆయనకు, శేషనాథుడి కృతఘ్నత గురించి చెప్పుకుని బాధ పడ్డాడు.

అందుకు సదానందుడు, ''భలేవాడివి! అతడి కారణంగానే, నేను ఇక్కడికి వచ్చాను. నీకు, నా అవసరం వున్నదని, శేషనాథుడే నాకు తెలియపరిచాడు,'' అన్నాడు.

వరాలయ్య ఆశ్చర్యపోయి, ''స్వామీ, తను చేయగల సాయం చేయకుండా, మిమ్మల్ని నావద్దకు పంపడంలో, అతడి ఉద్దేశమేమై వుంటుంది?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సదానందుడు నవ్వి, ''నువ్వు జీవితంలో పైకి వచ్చావు; శేషనాథుడు చితికిపోయాడు. ఆ దశలో నువ్వు తడికి సాయపడి, పైకి తీసుకువచ్చావు. అందువల్ల, అతడు నీకు సలహాలివ్వడానికి మొహమాటపడుతున్నాడు,'' అన్నాడు.

''సాయమడగడానికి లేని మొహమాటం, సలహాలివ్వడానికీ, నాలోని లోపాలు చెప్పడానికే వచ్చిందా?'' అన్నాడు వరాలయ్య కోపంగా.

''నువ్వు సాయపడ్డవ్యక్తి, నీకు సలహాలివ్వలేకపోతున్నాడంటే—ఆ లోపం ఆ వ్యక్తిదికాదు; నీది!'' అన్నాడు సదానందుడు.

వరాలయ్య ముందు తెల్లబోయినా, తరవాత గురువు చెప్పింది అర్థం చేసుకుని, ఆయన పాదాల మీద పడ్డాడు.

తను శేషనాథుడి ముందు దాతలా కాక, స్నేహితుడిలా ప్రవర్తించకపోవడమే, శేషనాథుడి ప్రవర్తనకు కారణం అని గ్రహించాక, వరాలయ్య తనలోని లోపాన్ని సవరించుకుని, తను కూడా శేషనాథుడివల్ల సత్ప్రయోజనాలు పొందాడు.



# పొదుపు

కొమరాజు డబ్బు దుబారా మనిషి. అతడికి హఠాత్తుగా పొదుపు చేయాలన్న ఆలోచన కలిగి, మిత్రుడు రంగనాథాన్ని సలహా అడిగాడు. రంగనాథం అతడికి ఒక మట్టితో చేసిన హుండీ ఇచ్చి, ఇక ఆ పొదుపేదో ప్రారంభించమన్నాడు.

కామరాజు హుండీలో కొంత డబ్బు వేసి, వారం తిరిగేసరికి, ఏదో అవసరం కోసం, దాన్ని పగలగొట్టి డబ్బు వాడుకున్నాడు. ఈ సంగతి విన్న రంగనాథం అతడికి ఇనుముతో చేసిన హుండీ యిచ్చి, దాని తాళపు చెవిని, కామరాజు ఇంటి ముందున్న పొదల్లోకి విసిరివేశాడు.

అయితే, వారం రోజులు గడిచాక రంగనాథం, కామరాజు ఇంటికేసి వచ్చినప్పుడు, అతడు పొదల్లో దేనికోసమో వెదుకుతూండడం కనిపించింది. సంగతేమని రంగనాథం అడగగా, డబ్బు అవసరం వచ్చిందనీ, రెండు రోజులుగా హుండీతాళపు చెవి కోసం వెతుకుతున్నాననీ, కామరాజు చెప్పాడు.

అందుకు రంగనాథం నవ్వి, " ఈ రెండు రోజుల్లో, ఆ డబ్బు అవసరం తీరే ఉంటుంది. నీలో వున్న పెద్ద లోపం ఏమంటే, కొద్దిపాటి అవసరం కలిగినా, దాచిన డబ్బు తీసి ఖర్చు పెట్టేస్తూంటావు. ఈ పొదల్లో, నీకా చిన్న తాళపుచెవి ఎలానూ కనిపించదు. ఇక శ్రమపడకు," అని సలహాయిచ్చాడు.

కామరాజు అవునన్నట్టు నిట్టూర్చి, "ఎలానైతేనేం, నన్ను పొదుపరిని చేశావు," అన్నాడు.

—దాసరి వెంకటరమణ





# మోసపోయిన మోసగాడు

ఒక గ్రామంలో ఒక రైతు ఉండేవాడు. ఆయనకు ఒక కొడుకు ఉండేవాడు. కొడుకు అటే తెలివి గలవాడు కాదు గాని, రైతు కోడలు మాత్రం చాలా తెలివి గలది.

ఒకనాటి ఉదయం రైతు కొడుకు ఇంటి ముందు కూచుని, కొడవలికి పిడి చెక్కుకుంటూ ఉండగా ముగ్గురు మనుషులు వచ్చి, "నిన్ను మా రాజు గారు ఒక్కసారి రమ్మన్నారు. మా రాజు సముద్రరాజు," అన్నారు.

సముద్రరాజు దేవతల జాతికి చెందిన వాడు. ఈ మనుషులు చూడబోతే నల్లగా, వికారంగా కనిపించారు. నిజానికి వాళ్ళు రాక్షసరాజు దూతలు. ఆ సంగతి రైతు కొడుకు గ్రహించలేదు.

"మీ రాజుకు నాతో ఏం పని?" అని అడిగాడు వాడు.

"ఈ దేశంలో నీ అంత తెలివిగలవాడు లేడుట. మా దేశంలో ఎవరూ చెయ్యలేని పని ఒకటి నీ చేత చేయించుకుందామని మా రాజుగారు నిన్ను రమ్మన్నారు," అన్నారు వాళ్ళు.

"తెలివి తేటలకు నేను కాదు, మా నాన్న. కావలిస్తే ఆయనను నిరభ్యంతరంగా మీ దేశం తీసుకువెళ్ళండి. ఆయన ఇప్పుడు పొలానికి వెళ్ళాడు, బాగా చీకటి పడిగాని ఇంటికి రాడు!" అన్నాడు రైతు కొడుకు.

"అయితే నువూ, ఆయనా కూడా వచ్చెయ్యండి. మేము మళ్ళీ మీ కోసం రాము. మా పడవ రేవులో ఉన్నది. రేపు ఉదయం బయలుదేరి రేవుకు వస్తే మిమ్మల్ని మా దేశం తీసుకుపోతాం!" అని ఆ నల్లటి మనుషులు ముగ్గురూ వెళ్లిపోయారు.



ఆ రాత్రి తండ్రి ఇంటికి రాగానే కొడుకు, "నాన్నా, మన కోసం సముద్ర రాజు మనుషులనూ పడవనూ పంపాడు. మనవల్ల ఆయన కేదో పని కావాలిట. ఆయన పని తీర్చామంటే మనకు మంచి బహుమానం దొరుకుతుంది," అన్నాడు.

"వాళ్ళు రాజుగారి వద్ద నుంచి ఏదైనా ఆనవాలు తెచ్చారా?" అని అడిగాడు రైతు.

"తీసుకురాలేదు. వాళ్ళు మళ్ళీ రారుట. మనం రేపు ఉదయం రేవుదాకా వెళ్ళితే, పడవలో ఎక్కించుకుని తమ దేశం తీసుకుపోతామన్నారు," అని రైతు కొడుకు చెప్పాడు.

"రేవుదాకా నడవటమే? నావల్ల కాదు. చాలా దూరం ఉన్నది. దూరం తగ్గించగలిగితే చెప్పు, వస్తాను!" అంటూ రైతు వెళ్ళి పడుకున్నాడు.

రైతు కొడుకు తన భార్యతో సముద్ర రాజు ఆహ్వానం గురించి చెప్పి, "రేవు దారి తగ్గిస్తేనేగాని నాన్న రానంటాడు! అది సాధ్యమయే పనేనా?" అన్నాడు.

అతని భార్య, "దారి తగ్గించటానికి ఒకటే ఉపాయం ఉన్నది. నడిచినంత సేపూ కథ చెప్పటం. ఆ పని చేసి మీ నాన్నను వెంట తీసుకుపొండి!" అని భర్తతో అన్నది.

రైతు కొడుకు తన భార్య తెలివి తేటలకు చాలా సంతోషించాడు. అతడు తెల్లవారు ఝామునే లేచి తండ్రిని లేపి, "నాన్నా, రేవుకు బయలుదేరుదాం పద. దారి తగ్గిస్తే వస్తా నన్నావుగా! తగ్గిస్తాను, రా!" అన్నాడు.

రైతూ, కొడుకూ సముద్ర తీరానికి బయలుదేరారు. దారి పొడుగునా కొడుకు తండ్రికి ఏవో కథలు చెప్పాడు. చివరకు వారు రేవు చేరుకున్నారు. రేవులో ఒక నాసిరకం పడవా, ముగ్గురు నల్లటి మనుషులూ ఉన్నారు.

"ఇదేం పడవరా? ఇది రాక్షసుల పడవలాగున్నది!" అన్నాడు రైతు.



నల్లటివాళ్ళు ఆయనతో, ''మా రాజు గారి పడవలన్నిటిలోకీ దీని వేగం చాలా ఎక్కువ. అందుకని దీన్ని పంపారు!'' అన్నారు.

రైతూ, కొడుకూ అందులో ఎక్కి కూచున్నారు. నల్లటివాళ్ళు తెడ్లు వేసి పడవను మెల్లగా నడపసాగారు. అది మామూలు పడవలలాగే నడిచి కొంత సేపటికి ఒక లంకను సమీపించింది. ఆ లంకలో ఎక్కడా ఒక్క చెట్టుగాని పొద గాని లేక బోడిగా ఉన్నది. అది రాక్షసుల లంక.

ఈ సంగతి రైతూ, కొడుకూ తెలుసుకున్నారు గాని చేసేదీ లేదు.

నల్లటివాళ్ళు తండ్రీ కొడుకులను తీరాన దించి తమ రాజు దగ్గిరికి తీసుకుపోయారు. రాక్షసరాజు ఇంకా నల్లగా, మరింత వికారంగా ఉన్నాడు.

''మమ్మల్ని, ఇంతదూరం ఎందుకు రప్పించారు?'' అని రైతు రాక్షసరాజును అడిగాడు.

''మరేమీ లేదు. మావద్ద ఒక పెద్ద భాండం ఉన్నది. దానికింద నిప్పు చెయ్యాలంటే మా వాళ్ళకు ఏ మాత్రం సాధ్యం కాలేదు. మీరిద్దరూ దానికింద మంట చేశారా సరేసరి, లేకపోతే, మిమ్మల్ని ఇక్కడి నుంచి ప్రాణాలతో పోనివ్వను,'' అన్నాడు రాక్షసరాజు.

''ముందు మాకా భాండం ఎక్కడున్నదో చూపించండి. మిగిలిన పని మేము చూస్తాం!'' అన్నాడు రైతు.

రాక్షసులు వారిని ఒక పెద్ద గదిలోకి తీసుకుపోయారు. ఆ గది మధ్య రెండు నిలువుల ఎత్తు రాగి భాండం ఉన్నది. రైతు రాక్షసులను గది బయటికి పంపేసి తలుపు గడియ పెట్టాడు. తరవాత తండ్రీ కొడుకు లిద్దరూ ఆ భాండం చుట్టూ తిరిగి వచ్చారు.

రైతు తన కొడుకుతో, ''నాయనా, ఈ భాండం సంగతి నీకు తెలుసా? ఇది అక్షయ భాండం. మన దేశపు రాజుగారి



ముత్తాతగారు రోజూ ఇందులో అన్నం వండించి, అడిగినవారికల్లా లేదనకుండా పెట్టేవారు. దాన్ని ఈ రాక్షసులు ఎత్తు కొచ్చి ఇక్కడ పెట్టుకున్నారు,'' అన్నాడు.

''ఇప్పుడు మనం ఈ రాక్షసుల బారి నుంచి బయటపడేది ఎలా ?'' అన్నాడు కొడుకు ఆదుర్దాగా.

"దానికి ఉపాయం నేను చూస్తానులే!" అంటూ రైతు గది తలుపు తెరిచి రాక్షసులను కేక పెట్టాడు. వాళ్ళు వచ్చి, ''భాండం కింద మంట చేశారా ?'' అని అడిగారు.

''మంట చేస్తాం ! గాలి ఊదితే మంట అవుతుందా ? నేరేడు కట్టెలూ, మామిడి కట్టెలూ, చింత కట్టెలూ, పొన్న కట్టెలూ, రావి కట్టెలూ, మర్రి కట్టెలూ, మారేడు కట్టెలూ, వెలగ కట్టెలూ, వెదురు కట్టెలూ—తొమ్మిది రకాల కట్టెలు తీసుకు రండి; దూదీ, చెకుముకి రాయీ, ఇనప ముక్కా తీసుకురండి. క్షణంలో మంట చేస్తాం!'' అన్నాడు రైతు.

రాక్షసులు తమ రాజు వద్దకు వెళ్ళి రైతు అన్న మాటలు చెప్పారు. రాక్షస రాజు వచ్చి, ''మీకు మతి పోయిందా ఏమిటి ? మా లంకలో గరిక కూడా మొలవదు, చెట్టు అన్నది అసలే లేదు, కట్టెలు ఎలా వస్తాయి ?'' అన్నాడు.

''మీ దేశంలో లేకపోతే మా దేశం నిండా కట్టెలే. మా కోడలి నడిగి మీ వాళ్ళను పట్టుకు రమ్మనండి. మీ మనుషుల వెంట మీ కొడుకు లిద్దర్ని పంపితే గాని అది నమ్మదు !'' అన్నాడు రైతు.

''వాళ్ళు కట్టెలు తెచ్చేదాకా ఈ గది లోనే ఉండండి !'' అంటూ రాజు తండ్రీ కొడుకులను భాండం ఉన్న గదిలో బంధించి, తన కొడుకులనూ, పడవ నడిపే వాళ్ళనూ రైతు ఉండే దేశానికి పంపాడు.

రాక్షసరాజు కొడుకులు రైతు ఇల్లు చేరుకుని రైతు కోడలితో, ''మేము రాక్షస రాజు కొడుకులం. నీ మామా, భర్తా మా

దేశంలో ఉన్నారు. నిన్నడిగి నేరేడు కట్టెలూ, మామిడి కట్టెలూ, చింత కట్టెలూ, పొన్న కట్టెలూ, రావి కట్టెలూ, మర్రి కట్టెలూ, మారేడు కట్టెలూ, వెలగ కట్టెలూ, వెదురు కట్టెలూ, దూదీ, చెకుముకి రాయీ, ఇనప ముక్కా తెమ్మన్నారు! మేం పోవాలి, వెంటనే ఇయ్యి!'' అన్నారు.

పెద్ద మోసం జరిగిందని రైతు కోడలు తెలుసుకున్నది. ఆమె రాక్షసరాజు కొడుకులతో, ''మీకు కావలసినవన్నీ ఆ చీకటి గదిలో ఉన్నాయి. మీకు కావలసినంత ఫట్టుకెళ్ళండి!'' అన్నది.

వాళ్ళు సరేనని చీకటి గదిలో ప్రవేశించారు. వెంటనే రైతు కోడలు చీకటి కొట్టు తలుపు మూసి, దానికి కప్పతాళం వేసింది.

ఆమె బయటికి వచ్చి మిగిలిన రాక్షసులతో, ''మీ రాజు కొడుకులిద్దరూ మా చీకటి గదిలో ఉన్నారు. ఎంత వెతికినా తాళం చెవి ఎక్కడున్నదో కనిపించటం లేదు. మా మనుషు లిద్దరూ ఇంటికి వచ్చి వెతికితే తప్ప అది కనిపించదని మీ రాజు గారితో చెప్పండి,'' అన్నది.

రాక్షసులు పడవలో తమ లంకకు బయలుదేరి వెళ్ళి, రైతు కోడలు అన్న మాటలు తమ రాజుతో చెప్పారు.

రాక్షసరాజు పళ్ళు పటపట కొరికాడు, కాని ఏమీ చెయ్యలేకపోయాడు. కాకిపిల్ల కాకికిముద్దు. తన కొడుకులను త్వరగా తెప్పించుకునే ఉద్దేశంతో ఆయన రైతునూ, రైతు కొడుకునూ చెర విడిపించి వెంటనే ప్రయాణం చేయించాడు.

''మేము మీ పని పూర్తిచేసి, బహుమతి పొందిగాని వెళ్ళం. మాకేమీ తొందర లేదు!'' అన్నాడు రైతు.

రాక్షసరాజు వారికి ఇంత బంగారం ముద్ద బహుమానంగా ఇచ్చాడు. తరవాత పడవలో రైతునూ, అతడి కొడుకునూ ఇంటికి పంపేసి అదే పడవలో తన కొడుకులను తిరిగి తెప్పించుకున్నాడు.

ఆనాటి నుంచి రైతూ, అతని కొడుకూ, కోడలూ సుఖంగా జీవించారు.



# పక్షులు - జంతువులు:

దక్షిణ అమెరికాలో ఒక జాతి ఎలుగుబంట్లకు కళ్ళ చుట్టూ కళ్ళద్దాల్లా ఒక రకం చారలు ఉన్నాయి. అందువల్ల వాటిని కళ్ళద్దాల ఎలుగుబంట్లు అంటారు.



వింత సులోచనాలు

## అపాయం!

సముద్రపు కందిరీగ అని పిలువబడే ఆస్ట్రేలియన్ బాక్స్ జెల్లీ అత్యంత అపాయకరమైన జెల్లీ చేప. దాని శరీరం నుంచి దాదాపు నాలుగుకోట్లు సన్నటి దారాల్లాంటి పోచలు వేలాడుతున్నాయి. అవి మనిషిని రెండుమూడు నిమిషాల్లో చంపగలవు!

గొంగళి పురుగు శరీరంలో దాదాపు 2,000 కండరాలు ఉన్నాయి. మనిషి శరీరంలో ఉన్నవి కేవలం 700 కండరాలు మాత్రమే!



కండరాల సమూహం

మీకు అందిస్తున్నాం!

# క్లియరసిల్ మెరుపు

## కొత్త క్లియరసిల్ సబ్బు
## ఎక్కువగా చేరిన నూనెల్ని తీసేసి, మీకిస్తుంది
## తేటైన, మెరుపుగల ముఖ వర్చస్సు

కొత్త క్లియరసిల్ సబ్బు. మీరు యిప్పటిదాకా యిలువంటి దానితో స్నానం చెయ్యనేలేదు మరి. ఎందుకంటారా యిది మిగతా వాటిలాగ కాదు— యీ కొత్త క్లియరసిల్ సబ్బులో గల హాయినిచ్చే పుష్కలమైన నురుగ, తీయాటి సుగంధం, సంతృప్తైన టీవి అనుభవం ఎలాగూ బాగుంటుంది— అంతేకాకుండా యిది మీ చర్మానికి వంటికంతటికీ ఎంతో మేలు చేస్తుందిక.

ఆ ఎందుకంటే, దీనిలోగల ప్రత్యేకమైన పదార్థాలూ, పుష్కలమైన, సమృద్ధి అయిన నురగ, మీ చర్మంలోని సూక్ష్మ రంధ్రాలను పూర్తిగా ఆ ఎక్కువగా చేరిన నూనెని సున్నితమైన తీరులో కరిగిపోయేస్తుంది గనక. దాంతో యిక మీ చర్మం మరింత శుభ్రంగా, మరింత తేటగా, అది కూడా మునుపెన్నడూ లేనంతగా రూపొందుతుంది. అదే మరి క్లియరసిల్ మెరుపు అంటే!




**కొత్త క్లియరసిల్ సబ్బు—చర్మంలోని జిడ్డు పోగొట్టేందుకు**

OBM/5428/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



Mrs. S. Radha



K. P. A. Swamy

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మే నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అమ్మ అండ నిశ్చింత     రెండవ ఫోటో: స్వేచ్ఛకోసమే యీ చింత

పంపినవారు: టి. శ్రీనివాసులు, ఎగువవీధి గ్రామం, శ్రీకాళహస్తి మండలం.

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. సిసిలీ  2. జార్జ్ వాషింగ్టన్  3. రజియాబేగం  4. హుమయూన్  5. సరోజినీ నాయుడు.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

The stories, articles and designs contained herein are exclusive property of the Publishers and copying or adapting them in any manner will be dealt with according to law.

# చిరునవ్వులు తెస్తుంది చవులూరించే ట్రింకా!

ట్రింకా త్రాగండి. వుల్లవుల్లగా చూడగానే తాగాలనిపించే మధుర రుచి! ఆకర్షణీయమైన గ్లాసుల నిండా చల్లచల్లగా తాగితే మజా. క్షణాల్లో తయార్! ట్రింకా– అందరూ ఇష్టపడే పానీయం.

ప్రతి సీసాతో 50 గ్లాసుల పానీయం.
ప్రతి ప్యాకెట్‌తో 6 గ్లాసుల పానీయం.







ఐదు గొప్ప రుచులు:
ఆరెంజ్, లెమన్, పైనాపిల్, కోలా, ఫ్రూట్ పంచ్.

ట్రింకా

రుచిలో అన్నిటికన్నా మిన్న!

కార్న్ ప్రొడక్ట్స్ కం. (ఇండియా) లిమిటెడ్

CLARION/B/CP/14/193 TEL


మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం
SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు
LINTAS RIN 97 2016 TL

# వనిత

## మే '86 సంచికలో....

సంకల్ప సిద్ధి
కంచి శంకరాచార్యుల వారిపై
మాలతీచందూర్
వ్యాసం

'కొత్త దంపతులు'
కొత్త శీర్షిక ప్రారంభం!

ఇది మన రాష్ట్రం శీర్షికలో
చిత్తూరు జిల్లా విశేషాలు

సూట్ కేస్ తయారు చేయడం ఎలా?
వర్ణ చిత్రంతో వ్యాసం

*

వాసిరెడ్డి సీతాదేవి
వాస్తవగాథలు

ఇంకా—

కె. రామలక్ష్మి—కాలానికి వంతెన, ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి—నెమలి కనులు, రెండు కథలు, ప్రముఖ దంపతులు శీర్షికలో శాంతకుమారి-పి. పుల్లయ్య, ఇదండీ సంగతి, ముగింపేమిటి? ఆలోచించండి, పాఠకులతో ప్రముఖ రచయిత్రులు, డా॥ ఆలూరి విజయలక్ష్మి—వైద్యవ్యాసం, మాటల కొలువు, బామ్మగారి పేజీ....మిమ్మల్ని అలరించే మరిన్ని శీర్షికలతో వెలువడింది.

# "ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అందించాలి యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ





"ఇంద్రజాలం కానే కానిది
చేత్తో చేసే తమాషా యిది
దబ్బాలోనూ పనియే లేదు
దీనికి ఇంక మరి తిరుగేలేదు."

"ఏమిటిదంతా ఇబ్బొద్ది చెప్పు
ఏంచెయ్యాలో దబ్బున చెప్పు."

"రండర్రా యిటు రండర్రా
చెప్పేదేదో వినిపోండర్రా
ఆలోచించి అందించింక
ఫెవికాల్ ఎమ్ ఆర్ తేవాలింక
ఏ బొమ్మయినా, ఏ బిట్టయినా
ఏ పర్సయినా చేసెయ్యొచ్చు
ఎట్టుకోకనే పట్టుకునేదిది
మరికే కానిది ముద్దైనది
సరదా సరదా తమాషాయిక
బొమ్మైనా చేసెయ్యింక"

జపాను పూలు (క్రిసాంథిమమ్స్) ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్ ను పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

జపాను పూలు (క్రిసాంథిమమ్స్) ఎలా తయారు చేయ్యాలి అనే తీరుని ఉచితంగా పొందటంకోసం ఈ కూపన్ ను చిరునామాకు పంపించండి : "ఫెవీ ఫెయిరీ," పోస్ట్ బాక్స్ 11084 బొంబాయి 400 020.

పేరు: ______________________

వయసు: ______________________

చిరునామా: ______________________

______________________

నగరం: ______________________

రాష్ట్రం: ____________ పిన్: ____________

(Ch)

**ఫెవికాల్** ఎమ్ ఆర్
సింథెటిక్ ఎడ్హెసివ్




**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

OBM-7070 TL

అమ్మా జీ?

పార్లే-G!




## 'పార్లే-G' ఎందుకని?

మీకు అత్యంత ప్రియమైన బిస్కట్లకు
చక్కటి తియ్యటి చిట్టిపేరు ఉండవద్దూ!
అందుకే 'పార్లే-G' అన్న పేరు. అవును కదా మరి.
'పార్లే-G' అని పిలవడంలో మరెంతో సాన్నిహిత్యం
వ్యక్తమవుతుంది. ఈ బిస్కట్లలో జీవనదిలా ఆ పాలు,
గోధుమలు, చక్కెర, జీవనదిలా ఆ శక్తినిచ్చే గ్లూకో,
జీవనదిలా ఆ గొప్పరుచి పొంగి పొర్లుతుంటే
'పార్లే-G' అన్న పేరు వీటికి చక్కగా నప్పుతుంది కదూ!

PARLE

Gluco

# ప్రేమతో నిండిన పేరు 'పార్లే-G'

మరింత రుచిగల శక్తిదాయక ఆహారం.

భారతదేశంలో అత్యధికంగా అమ్ముడవుతున్న బిస్కట్.

everest/85/PP/557-tl